# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాసపత్రిక

**26**

న వం బ ర్ 1971

నిర్వహణ

'సా హి తీ మి త్రు లు'

72 పేజీలు    ఒక రూపాయి

ముఖచిత్రం :
రేప్ ఆఫ్ బంగ్లాదేశ్
దొరై స్వామి
(లలితకళా అకాడమీ, ఆంధ్రప్రదేశ్ సౌజన్యంతో)

ప్రతులకు, వివరాలకు :
4/729 కుమార్‌పల్లి,
హనుమకొండ,
వరంగల్–1. (ఆం. ప్ర.)

సంవత్సర చందా : పది రూపాయలు
అర్థ సంవత్సర చందా : ఆరు రూపాయలు
విడిప్రతి : ఒక రూపాయి

Edited and Published by Varavararao for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayamu,
J. P. N. Road, Warangal-2 (A.P.)

## సృజన ప్రచురణలు

సాహిత్యంలో విప్లవోద్యమం

కొడవటిగంటి కుటుంబరావు

వెలువడింది.

వెల: 2రూపాయలు

వినడానికో కథ (కథాసంకలనం)

పింగళి రంగారావు

వెల: 175 పైసలు

కొద్ది కాపీలు మాత్రమే మిగిలినవి.

త్వరపడండి. సృజనవలెనే సృజన ప్రచురణలను ప్రోత్సహించండి.

అంపశయ్య (ప్రయోగాత్మక నవల)

నవీన్

మాదీ మీ వూరే (కవితా సంకలనం)

సి. వి. కృష్ణారావు

కాపీలు అయిపోయినవి.

కాపీలకు :

4/729 కుమార్ పల్లి

హనుమకొండ

వరంగల్-1 (ఆంప్ర)

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

71 నవంబర్ మాసపత్రిక 26

## బంగ్లాదేశ్ - వియత్నాం

ఈనాడు బంగ్లాదేశ్‌లో వున్న పరిస్థితికి ప్రజాస్వామ్యం అసంబద్ధమైనది.

బెంగాల్ ఒక రాజకీయవిధానం కోసంకాదు తన జీవితంకోసం పోరాడుతున్నది. అది వియత్నాంవలె జవాబు చెప్పాల్సి వున్నది: 'మేం చావాల్సివుంటే చస్తాం కాని మా మరణం శత్రునిర్విశేషం చేస్తుంది'.

మృతప్రాయమైన ఆదర్శవాదం గురించి బెంగాల్ ఆలోచించ గూడదు. 'మేం అందరమూ బలి అయిపోవచ్చు కాని పోరాటాన్ని వదిలిపెట్టం' అని అనగలగాలి.

నలభై సంవత్సరాల కింద చెల్లిపోయిన ఆంగ్లోసాగ్జన్ ఉదారవాదంమీదో, ప్రమత్తులైన అమెరికావారి సద్భావంమీదో బెంగాల్ ఆధారపడకూడదు. బంగ్లాదేశ్ తన సాహసాన్ని తను పిల్చుకోవాలి: నిజానికి బెంగాల్ చాలా సాహసికమైన జాతి. అర్జీలు నిరుపయోగం. బంగ్లాదేశ్‌కు యీనాడు కావలసింది మిలిటరీ నిర్మాణం. పాకిస్తాన్‌తో అయత్తమైన యుద్ధాలను ఎదుర్కోవడానికైనా సిద్ధంకావలె లేదా గెరిల్లా నిర్మాణం చేసుకుని పాకిస్తాన్‌ను ఓడించాలి.

ఆఖరుకు అమెరికా అయినా వియత్నాంను అణచివేయలేకపోయింది.

—అంద్రే మాల్రాక్స్
సుప్రసిద్ధ ఫ్రెంచ్ సాహిత్యవేత్త.

## ఊరేగింపు

'విప్లవం వర్ధిల్లాలి, విప్లవం వర్ధిల్లాలి'
'వర్ధిల్లాలి వర్ధిల్లాలి, విప్లవం వర్ధిల్లాలి'
వేలకంఠాల ఆశల తరంగాలు వీస్తున్న ఝుంఝు
ఖమ్మం ఆకాశంమీంచి గ్రామాల్లోకి
ఎదురుచూస్తూ నిల్చిన ప్రాణాల్లోకి వీచింది.

'ఇన్‌ఖ్విలాబ్ జిందాబాద్'
'జిందాబాద్ జిందాబాద్
ఇన్‌ఖ్విలాబ్ జిందాబాద్' నినాదం
ఈథర్ మోసుకపోయి
పేద హృదయాల రేడియోల్లో వినిపించింది

అవి కంఠాలు కావు
దగాపడిన సమాజం గుండెల్లోంచి పెల్లుబికిన లావాలు
అవి నినాదాలుకావు
తెలిసి తెలిసీ మేధావులు
దోపిడీ ప్రభుత్వంతో తెచ్చుకుంటున్న ప్రమాదాలు
అవి రణన్నినాదాలు, సాయుధ వివాదాలు
'సాయుధ పోరాటమే, ఏకైకమార్గం'
'ఏకైక మార్గం, సాయుధ పోరాటం'

విశ్వవిద్యాలయాల విషపు కౌగిళ్ళలో
తేనెకత్తుల అంచులమీద నిల్చి
చదువుకున్న మాటల్లో లోపించిన చరిత్ర సత్యాలను
జీవితాల్లో చూస్తున్న కళ్ళు
కోపంగా, స్థిరనిర్ణయంతో ఆకాశాన్నీ భూమినీ ప్రశ్నిస్తే
అంతటా ఎర్రెర్ర జెండాలు ఎగిరిన కాంతులు

'ఎగరాలి ఎగరాలి, ఎర్రజెండా ఎగరాలి'
'ఎర్రజెండా ఎగరాలి, ఎగరాలి ఎగరాలి'

ధనస్వాముల కోసం యంత్రాల్లో
ఇంధనమైపోతున్న కార్మికుల చేతులు
నిరుద్యోగం కోసం పరీక్షలు రాస్తున్న
విద్యార్థుల చేతులు
భూస్వాముల కోసం
నీళ్ళూ, నాగళ్ళూ, కొడవళ్ళూ, పంటలూ అవుతున్న చేతులు
నల్లటి అబద్ధపు బల్లమీద
రాజీ బలపాల అక్షరాలు రాసి
పసి హృదయాల్లోకి అబద్ధపు సెంటిమెంట్లను
సరఫరా చేస్తున్న టీచర్ల చేతులు
ప్రశ్నించే పనిముట్లయి, కర్రలై
పడగెత్తిన పాములై, తిరుగబడ్డ ఆయుధాలై
పిడికిళ్ళు బిగించి
విసిరి విసిరి, సారించి సారించి
భవిష్యత్తు జెండాకు సంకేతాలైనవి.

'బూర్జువా సంస్కృతి నశించాలి'
'బూర్జువా కళలు నశించాలి'
'సెక్సు కంపు సాహిత్యం నశించాలి'
'బూర్జువా కోర్టులు నశించాలి'
'పోలీసు జులుం నశించాలి'
ప్రజల చేతులేం కోరుకుంటున్నాయి
ప్రజల చేతలేం కోరుకుంటున్నాయి
ప్రజా చైతన్యం ఏం కోరుకుంటున్నది
'శ్రామిక నియంతృత్వం స్థాపించాలి'
'శ్రామిక సాహిత్యం వర్ధిల్లాలి'
'సాంస్కృతిక విప్లవం వర్ధిల్లాలి'
'ప్రజాకోర్టులు కావాలి'

మునిసిపల్ చెత్తను ఇరవై ఏళ్ళుగా
ఎన్నికల పండుగలు ఊడ్చేసిన తోరణాలవలె
మోస్తున్న వీధులు,
కొత్త ఆశల చీపుర్లు ఊడుస్తున్న పులకరింతలతో
ఊరేగింపు పాదాలను తాకుతున్నవి
రేపు నడిచివచ్చే ప్రజాసైన్యం
కవాతుల్లోని ఉత్సాహాన్ని చవిచూస్తున్నయి.

అవి కాళ్ళుకావు
వర్తమాన విప్లవాసన్న
సమాజ హృదయంలోకి
వ్యాపిస్తున్న వేళ్ళు
సామ్రాజ్య వాదం చాపకిందికి వెచ్చగావస్తున్న
మంటల నీళ్ళు
అవి నడకలు, ఉరుకులు, పరుగులు
భవిష్యత్తు— వర్తమానంలోకి సమూలమార్పుతో
శ్రామిక సూర్యుడు ఉదయించిన తూర్పుతోవస్తున్నట్లు

అది ఊరేగింపుకాదు
చెలరేగిన చైతన్యం గుంపు
రేపటికోసం
యువతరం బలిదానాలకైనాసరే చేసిన తెగింపు

"సత్యం అమర్ హై, అమర్ హై సత్యం"
వాళ్ళకు వీరునిచావు చావుకాదని తెలుసు
వాళ్ళకు సత్యానికి చావులేదని తెలుసు
వాళ్ళకు రక్తపాతంలేకుండా విప్లవంరాదని తెలుసు
వాళ్ళకు తుపాకులకు బెదరి విప్లవం ఆగదనికూడా తెలుసు
ఆశగా పెంటకుప్పల్లోంచి
మెడసారించి చూస్తున్న మాలగుడిసెలకు

మురిసిపోతూ మురికి గుంటల్లోంచి
ముక్కు పిండుకుంటున్న బరిబాతల పిల్లలకు
సఫాయికుండీకన్నా కనాకష్టంగా
బతుకులు సాగిస్తున్న పీడితులకు
అందుకే సాహస హస్తాలు అందిస్తున్నారు వారు.

'సత్యం సత్యం చావదు చావదు'
'చావదు చావదు సత్యం చావదు'
'సత్యం చావదు, సత్యం చావదు'
'ఆగదు ఆగదు, విప్లవమాగదు'
'విప్లవమాగదు, ఆగదు ఆగదు'
'సత్యం చావదు విప్లవమాగదు'
'చావదు చావదు సత్యం చావదు'
'ఆగదు ఆగదు విప్లవమాగదు'
ఆగదు ఊరేగింపు

ఆకాశం వానకురిసినా
ఆగదు విప్లవం ప్రభుత్వం బుల్లెట్లు కురిసినా.
సాగింది ఊరేగింపు
సందులూ, గొందులూ గడిచి
హృదయాలు ఘాతువడ్డ పూరిండ్లకళ్ళు మెరిసాయి
వడ్డీల యిటుకలతో కట్టిన దుకాణాలు నోళ్ళుతెరిచాయి

తమ బిడ్డలమీద ప్రయోగించే లాఠీలు
తమవిమోచన యోధులమీద కురిపించే తూటాలు
మోస్తున్నందుకు పోలీసుల చేతులు కుంచించుకుపోయేట్లు
నినాదాలు హృదయాల్లోంచి రగుల్కొంటున్నాయి

వీళ్ళకు పీడితజాతి విమోచనకాంక్ష తప్ప
జాతీయ దురహంకారం లేదు
వీళ్ళకు ప్రపంచకార్మిక శ్రేయస్సు తప్ప

అడ్డుగోడలులేవు
వెలుగెటువైపునుంచి వస్తే అటువైపుగా సాగేతీగలు వీళ్ళు
చీకట్లలోకి తూర్పు సూర్యుణ్ణి తీసుకపోయే లైట్లువీళ్ళు
పిలుపు ఎవరిచ్చినా అందుకొని పీడితులకోసం
ప్రాణాలు బలియిచ్చే త్యాగులువీళ్ళు
వీళ్ళకు ప్రపంచ విప్లవకేంద్రం నవచైనా
తూర్పుదిక్కు
ప్రపంచ విప్లవసారథి
మావోదిక్సూచి
నక్సల్‌బరీ, శ్రీకాకుళం
ఎక్సైట్‌చేసే పోరాట సంకేతాలు
"నక్సల్‌బరీ జిందాబాద్, శ్రీకాకుళ గిరిజనపోరాటం వర్ధిల్లాలి"
'చైర్మన్ మావో జిందాబాద్'
'పౌరహక్కులు రక్షించబడాలి'

వీళ్ళకు భూస్వామ్య వ్యవస్థ నిర్వచించే
దేశభక్తిలేదు
ప్రజలు వీళ్ళనీతి
పీడితులు వీళ్ళపార్టీ
వర్గ సమాజంలో ఏశాసనమూ
అందరిమేలూ కోరదని
అందుకే ఆయుధాలు మొలిచాయి వీరిగొంతుల్లో

ఊరేగింపు ఊరుచుట్టు సాగింది
నక్సల్‌బరీలో రాజుకున్న విప్లవం
దేశమంతటా పాకినట్లు.

వానకురిసింది, ఊరేగింపు ఉరకలేదు
పోలీస్ స్టేషన్‌లనూ, కార్లనూ, మేడలను చూస్తే
ఊరేగింపుకు ఉద్రేకం వచ్చింది.

వీధులనూ, మురికి కాల్వలనూ, చెత్తనూ, కంపునూ, చూస్తే
ఊరేగింపుకు పార్లమెంటులా గనిపించింది.
పేదలనూ, గుడిసెలనూ, పిల్లలనూ చూస్తే
ఊరేగింపుకు ఉప్పెనలా ఆవేదన కలిగింది

ఊరేగింపు నడిచింది, వానలో తడిసింది
ఊరేగింపు సాగింది, ఆవేశంలో ఊగింది
'పీడితజనుల రక్తం— రక్తాన్నే కోరుతుంది'
రక్తం మసలుతున్న యువకులు
రక్తం పొంగుతున్న యువకులు
రక్తం రాజీపడని యువకులు
రక్తాక్షరాలు తప్పపలుకలేరు.

వాళ్ళలో టీచర్లు వున్నారు
పేదోళ్ళ మాత్రమేకారు మేధావులు
ఈవిద్యా విధానంలోని కుట్రను విపులంగా చెప్పగలవారు
ఈకుళ్లువ్యవస్థ కప్పుకున్న ముసుగును నిశితంగా విప్పగలవారు
ఆలోచనలను తరతరాలకు పంచగల గాలులు
ప్రజల మధ్యన మంచినీటిలోవలె మసలే చేపలు.

వాళ్ళలో విద్యార్థులున్నారు
చదువుతున్న వారుమాత్రమే కాదు చదువుకున్నవారు
రేపటితరం కోసం కళ్ళల్లో కాగడాలు వెలిగించుకొని
గుండెల్లో సాహసాలు పండించుకున్నవారు
దేశంలో అన్నివర్గాల సంతానం కావచ్చు
కాని శ్రామికవర్గంతో ఒకటై సాగినవారు

వాళ్ళలో కార్మికులున్నారు
శ్రమవిలువ తెలిసినవారు, శ్రామికశక్తి తెలిసినవారు
శ్రామిక ఐక్యత తెలిసినవారు, ధనస్వామ్యం తమనుచేస్తున్న
దగాతెలిసినవారు

చదువుకోనివారేకాని సమాజాన్ని చదువుకున్నవారు
తమరాజ్యం, సమరాజ్యం
మనిషిని మనిషి దోచుకోని రాజ్యంకోసం
మార్చ్ చేస్తున్న వారు
చూపుల్లో లాంగ్‌మార్చ్ రూపుకట్టినవారు
"జోహార్లూ, జోహార్లూ, సుబ్బారావు పాణిగ్రాహికి జోహార్లు"
'అమర్ హై సుబ్బారావు పాణిగ్రాహి'
'సుబ్బారావు పాణిగ్రాహికి జోహార్లు జోహార్లు'
ఊరేగింపు సుబ్బారావు పాణిగ్రాహినగర్ చేరింది
పాణిగ్రాహి అందించిన చేతుల్లో కళలూ ఆయుధాలూ
కవులూ యోధులూ అందుకున్నారు

ఊరేగింపు ఊరేగింపు కాదు
సిద్ధాంత ఆవేశాలనుంచి
జీవిత సత్యాలనుంచి
చెలరేగిన గుంపు
తెలిసితెలిసీ న్యాయంకోసం చేసిన తెగింపు

ఊరేగింపు ఊరేగింపు కాదు
పీడితుల హృదయాల్లో వీచిన ఆశా ఝంఝ
పేదల ఆకాంక్షలో ఉదయించిన తూర్పుసంధ్య.

— పచ్చల ఎర్రియ్య

## నావాడు

సుధాకర్

లంచం తీసుకుంటే పట్టుకొని
లంచం ఇస్తే విడిచే వ్యవస్థలో
ఇంకెంతకాలం మనిషీ
నీ జీవితాన్ని ఇన్‌స్టాల్‌మెంట్లతోను
వన్‌బై టూలతోను నెట్టుకొస్తూ
ఈ రంకులాడి వ్యవస్థతో అవస్థపడుతావ్.

నీరక్తం, చెమట, కన్నీళ్ళలోకి
యుడికలోన్ లవెండర్లను చిలకరిస్తూ
ఫూల్‌గా నిన్ను గట్టుమీద నిలబెట్టి
వాళ్ళ జీవిత స్విమ్మింగ్ పూల్స్‌లో
ఈజీగా ఈదేస్తున్నారు.
హిందూ మహాసంసార సాగరం నీవొంతట
ఈదాలని ఉంటే ఈదెయ్.

ఒకచెంప చరిస్తే మరోచెంప చూపించు
నీ చెల్లెని చెరిచినవాడి అక్కున నీ అక్కను చేర్చు
అప్పటికీ వాడిలో మానసిక పరివర్తన రాలేదా
భయమెందుకు! నీభార్యుందిగా:
ఛీ! ఛీ! వెధవకొల్లాయి సిద్ధాంతాన్ని
చిలకొయ్యకి కూడ తగిలించకు
చితిపేర్చి నిప్పంటించేసెయ్.

టీనేజ్‌నుండి యంగ్‌ఏజ్‌వరకూ
భారతిని భాగ్యవంతుల ఎంగేజ్‌మెంట్‌లోనే ఉంచి
భిడావ్‌పద్దుల్తో పొద్దుపుచ్చే

జీ హుకూంగాళ్ళు
జో హుజూర్‌గాళ్ళు
జొరూకే గులాంగాళ్ళు
తానెతందానె తైనాతీగాళ్ళు
వాళ్ళు, వీళ్ళు ఎవళ్ళైతేనేం
వర్గరహిత సమాజ స్థాపనకి
వారం వర్జ్యంచూసే వాడొట్టివాజమ్మ
ఒరలోంచి కత్తిదూయ గలిగినవాడే నావాడు
వాడే అసలు సిసలైన వీరుడు
తక్కిన వాళ్ళంతా తిక్కన స్నానం చేయాల్సిందే.

యం. నరసింగరావు కవితలు రెండు:

## నిజం నిజం నిజం నిజం

అద్గద్గో
అదే అదే
కనిపించంది కనిపించేదే
కంపించంది కంపించేదే
చెక్కుచెదరంది పిండిలా అయ్యేదే
ఔను
ఔనౌను
నిజం నిజం నిజం
ప్రజలశక్తి నిజం నిజం

'ప్రపంచంలో ఏదీ శాశ్వితం కాదు' అనే ఆధ్యాత్మికంగాళ్ళు గోచీలు పిలకలు ముడివేసి ఎలా బతకాలో బాగానేర్చుకున్నారు. బయటకి 'హరెరామ హరె కృష్ణ'గాళ్ళు జనాన్ని అంధకారంలోకి తోస్తున్నారు. విద్యపేరిట రాజకీయ నాయకులు నడిపే విశ్వవిద్యాలయాలు యువతరాన్ని నిర్వీర్యం చేస్తున్నాయ్. వేదాంతం కూడా విశ్వవిద్యాలయాల్లో ప్రవేశపెట్టి యువకుల్ని, భావినిర్మించే

ధీరుల్ని నపుంసకులుగా తయారుచేయడానికి పథకాలు వేస్తున్నారు. పోలీసు బలగాల్ని గులాముల్లా ఉపయోగించుకుంటున్నారు. జనం వృద్ధిచెంది సామాన్య హక్కులకోసం తిరగబడి, నిలదీసి అడిగి ఉప్పుపాతర వేస్తారేమో నని భయంతో కుటుంబ నియంత్రణ మొదలుపెట్టారు. ఉన్నదున్నట్లు, కుండ బద్దలుకొట్టినట్టు వాస్తవాన్ని వాస్తవంగా రాస్తున్న రచయితల్ని, కవుల్ని నిర్బంధించి ప్రజల్ని నిజం తెలుసుకోనీకుండా చేస్తున్నారు.

వీళ్ళన్ని చేసినా—
నిజం నిజమే
రెండ్వేపులా తిరగబడ్డప్పుడు
నిజం నిప్పై మండుతుంది
రెండు వర్గాలు
రెండు శ్వాసలు
ఒకటి కొకటితాకి
నిజంవేపు నిప్పుపుట్టి
అబద్ధాన్ని కాల్చేస్తుంది
చీడపురుగుల్ని చీల్చేస్తుంది
(అప్పుడు ట్రాఫిక్ పోలీసక్కర్లేదు
ఎవరిదారి వారికి తెలుసు)
చిన్న చిన్నచీమలే రాజ్యాలేల్తాయ్
భావి నీది
భావి ప్రజలది
ప్రజా ప్రజా ప్రజా విజయం
నిజం నిజం నిజం నిజం
ఆ కాలంలో ఈ కాలంలో
రేపటి కాలంలో
నిజం ప్రతిసారి
ప్రజా విజయం నిజం నిజం.

## ఇరవైమూడేళ్ళూ తగలబడుతున్నాయ్ం !

బంగళా అంటుకున్నది
భగభగ మంట మండుతున్నది
సామాగ్రి అంతా కాలిపోతున్నది
గాంధీ పటం, రాట్నం వగైరా
ఖద్దరులాల్చి, ధోవతి కండువా
ఆర్పడానికి ఎవరికీ గుండెల్లేవు
ఫైరింజెన్లు చిల్లులు పడిపోయాయి
నీళ్ళు ఉద్యోగులు తాగేసేరు
నీళ్ళులేవు ఫైరింజన్లులేవు
చేదబావిలేదు చుట్టుపక్కల చెరువులేదు
ఒక్కొకటే అన్నీ తగలబడుతున్నాయ్
గాంధీపటం కాలుతుంది
రాట్నం కాలుతుంది
రాట్నం కంటిపెట్టుకున్న బూజుకాలుతుంది
లాల్చీ కాలుతుంది
ధోవతి కాలుతుంది
టోపీ కాలుతుంది
అసలు కాలనిదేది
అన్నీ కాలుతున్నాయ్—
నాయకుని ఇల్లు కాలుతుంది
కాదు దేశమే కాలుతుంది
అయ్యో ఖద్దరు కాలుతుంది
అయ్యోనాగాంధీ ఆనవాలు కాలుతుంది
యెవ్వరూ కాపాడరు
యెవ్వరూ రక్షించరు
యెవ్వరూ పాపం అనరు
డబ్బుపోతే పోయింది

మళ్ళీ ఎలక్షన్లల్లో గెలిస్తే
ఇలాంటి పదిబంగళాలు కడతాను
గాంధీపేరు చెప్పుకొని—
నేను ప్రాణప్రదంగా చూసుకుంటున్న
రాట్నం కాలుతుంది
ఖద్దరు కాలి నుసవుతుంది
నా చిహ్నమే కాలుతుందే!
రక్షించండర్రా దౌర్భాగ్యుల్లారా
వెధవల్లారా రక్షించండర్రా
గొర్రెల్లారా రక్షించండర్రా
దున్నపోతులు ఒక్కడూ పలకడే
నాగాంధే బతికుంటే
అహింసంటూ విధ్వంసనంటూ
మిమ్మల్ని బోసుల్లాగా చూడకపోనూ
నాగాంధే బతికుంటె
జాతినంతా ఆధ్యాత్మికంవేపు మలిచి
నామాట వినేట్టు చేయకపోనూ
అసలు గాంధిలేకే మీరింతగా తెగించారు
గాంధిలేకే
మీరు ఖద్దర్నికాల్చి పర్రిజలదృష్టి మరల్చారు
నాగాంధి
ఈ జాతినంతా కొన్నిశతాబ్దాలవరకు
ఆలోచనీకుండా చేసి
మాకు దాండురాసిచ్చి పోయాడు
ఇది గొర్రెమూక
ఖద్దర్నికాస్త ఇస్త్రీచేసి ధరించండి
వాళ్ళేం చేస్తారు వినకచస్తారా
వినకుంటే—
అహింస అనే ఖద్దరు ధరించి
పోలీసుల్తో చంపిస్తైసరి
వినకుంటె—

దేశద్రోహులని ప్రకటించి
బోనులోనూ కైసరి
ఒకడు మానవత్వం గురించి తిరగబడితె
పదిమందిని చంపండి
పదిమంది తిరగబడితె
వందమందిని చంపండి
వంద ఐతేవేయి
వేయైతే ఇంకా—
మీకుపూర్తిగా ప్రాణాల్నితీసే బాధ్యతనిస్తున్నా
పోతె ఇలా చంపుతున్నామని
మైకుల్లో రేడియోల్లో పేపర్లో
మాత్రం చెప్పకండేం!
చచ్చిన వాళ్ళందరు పోలీసుల్తో కలెబడి
దాడిలో చచ్చారనండి
బోనులో ఉన్నవాళ్ళని
చావనీకుండా చచ్చేట్టు చంపండి
ఎదురు తిరిగిన ప్రతి వెధవని
'దేశద్రోహి' అని బాహాటంగా ప్రకటించండి
ఇంకా వివరంగా చెప్పక్కర్లేదు మీకు
మీరందరూ నాజుట్టులో పుట్టినవాళ్ళు
అందుకే చెబుతున్నా
"వాళ్ళు చంపితె హత్య
మనం చంపితే శాంతిభద్రత"
నేనెళ్ళి ఇంకొందర్ని పంపిస్తా
మతంగాళ్ళని దివిటీగాళ్ళని
వాళ్ళు మీతో పోట్లాడుతూనే
పరోక్షంగా మీతో సహకరిస్తారు
మీకేం భయంలేదు

ఎప్పటికప్పుడు
ప్రజలు నిర్వీర్యులయ్యేట్టు
నరాల్లోకి ఏదోఒకటి ఇంజెక్టుచేస్తూ ఉండండి-...
ఇన్నేళ్ళు ఎలాగో ఈ చిట్కాలతో
హాయిగా సర్దుకుపోయేము
కాని
ఇప్పుడు
బంగళా అంటుకుంటున్నది
భగ భగమంట మండుతున్నది
గాంధీపటం రాట్నం వగైరా
ఇరవై మూడేళ్ళ నూలూ
పత్తి
బూజు
మిల్లు ఖద్దరులాల్చి
ధోవతి ఖండువా
ఒకటేమిటి
వరసగా అన్నీ అంటుకుంటున్నాయ్
కుష్టి, ముష్టివెధవల్లారా రక్షించండర్రా
బీద బానిసల్లారా రక్షించండి
పోలీసువాడొక్కడూ కనిపించడే
లాభంలేదు
ప్రైమినిస్టరూ సైన్యం పంపు.

ఎక్స్-రే కవితలు రెండు:

## బావుటాలు పంచిపెట్టు

ఈ కల నిజమవుతుంది
ఈ చెర విడిపోతుందని
చెబుతున్నా నిదే నిజం
కత్తులపంట నా ఇజం

సంకెళ్ళను తెంచివేసి
సంతోషం పంటచూపు
బానిసల బాహువులకు
బావుటాలు పంచిపెట్టు

పాతరాతి గోరీపై
కొత్త ఎర్రపూలు చూడు
సాంప్రదాయ మేదైనా
సాంద్రవనం మరచిపోకు

అనగనగా రోజుల్లో
అణగారిన జనం తుదకు
అరాచక వాదులపై
ఆయుధాలు విసురుతారు

సిద్ధాంతం చప్పరించి
సిద్ధిపొందలేదు మనిషి
ఆచరణకు వీలుకాని
ఆలోచన అంపశయ్య.

## సాహసానికి సహస్ర హస్తాల్

బూర్జువా చచ్చుపదవుల్ని తన్నేసి
రియాక్షనరీ రోగాల డిగ్రీలని
చెత్తకుండీల్లోకి పారేసి
నీ సాహసాల ఆయుధాలమూటని వీపున మోసుకుంటూ
పల్లెజల్లోకి వొచ్చిన అన్నా
ఇదిగో నీకు విప్లవ స్వాగతంరా.

పిల్లల్నొదిలి వాళ్ళ తల్లినొదిలి
అమ్మనీ అయ్యనీ అసహాయస్థితిలో వొదిలి
ఎల్లలెరగని ఏకరాజ్యాన్ని నిర్మించాలని
విశ్వాసం స్టెన్‌గన్‌తో వొచ్చిన అన్నా
నీతోటి గెరిల్లాలు
గుండెల్లోకి తీసుకుని
అన్నాఅన్నాఅని స్వాగతగానం చేస్తున్నారురా

ఇరుగునా పొరుగునా
నీ అన్నదమ్ములు
గల్లీల్లో గలీజులో
నీ అక్కచెల్లెళ్ళు
మృగాల్లాగున్నారు రోగాల్లాగున్నారు
మురికి కాలవల్లో గిలగిల
తన్నుకు చస్తుంటే
ఏదిక్కూ తోచక
రక్షించండి మొర్రో ధర్మం ప్రభో అని గొంతు
చించుకుని ఎంత ఏడ్చినా

ఎవరూ విన్లేదు
నీవేపు చూడలేదు
కన్నీటితో కరిగి కరిగి
పేరుపేరున విద్రోహుల కుట్రలను కర్మాగారాలను చాటి
వాళ్ళ సమిష్టి కూటమి
శతాబ్దాల బలాన్ని
కూకటివేళ్ళతో పెళ్ళగించటానికి
ఈదారి పట్టావు
అన్నా మనదారి ఒక్కటేరా
మనందరం ఒక్కటేరా.

నగ్నముని కవితలు :

## ఉషస్

తూర్పుగాలికి
ఆకుపచ్చనిచెట్లు ఆహ్లాదంగా తలలూపినట్లుగా
పిందెలు కాయలై పండ్లయినంత సహజంగా
పర్వతాగ్రం నుండి జలలు వేగంగాదూకి
విద్యుత్తించినట్లుగా
బందూకులా
బాణంలా
ఎర్రగా
కర్కశంగా
కసిగా
మనిషిగా
వర్గచైతన్యంతో మనం ముందుకు వెడతాం.

## ప్రజా కవులు

మనుషులంతా పైకి ఒకలాగే కనబడినా
మనీషులుగా చలామణీ అవుతూ బలహీనుల్ని
రాజ్యాంగం మంటల్లో వేయించుకు తినేసే రాజకీయాల
నానారకాల వ్యాపారాల ముసుగుల్లో రాబందులున్నట్లే
కవుల్లోనూ
దొంగకవులూ లంజకవులూ వుంటారు
సినీమాల్లోనూ అకాడమీల్లోనూ
వాడిదగ్గరా వీడిదగ్గరా లంజరికం చేస్తూనే
పంచరత్నాలూ
ప్రజాగేయాలూ
ఒకేచేత్తో ముడ్డికడుక్కుంటుంటారు

పెద్దపెద్ద ఘరానా మనుషులు గుద్దిన
దొంగడబ్బా
సారాతో వాగ్దానాలతో ప్రజల అమాయికత్వంతో
అధికారంలో కొచ్చిన దొంగ ప్రభుత్వాలూ
కాసేపు దర్జాగా వెలిగినట్లుగానే
దొంగతనాన్నీ లంజతనాన్నీ ప్రజల్ని దోచుకుతినడాన్నీ
కళగా పోషించే దొంగ పత్రికలూ రేడియోలూ
ఈ నలిపేకవుల కులికేగీతాల్ని
నిరంతరం ప్రచారం చేస్తూవుంటాయ్

పొలాల్లో
ఫ్యాక్టరీల్లో
విశ్వవిద్యాలయాల్లో

యువత భగ్గునమండి
పండించే బందూకుల పంట చేతికిరాంగానే
ఈ నపుంసకుల నాటకానికి తెరపడుతుంది
ఈ లంజ టెక్కుల దొంగనిక్కుల రంగులు చెరిగిపోతాయ్
ఈ పొట్టలూ బాంక్ ఎకౌంటులూ బయటపడతాయ్
అప్పుడు నిజమైన ప్రజ వారిగుండెలమీద
పిడికిళ్ళతో నిలుస్తుంది
అప్పుడు నిజమైన ప్రజాకవిత మిగుల్తుంది
ప్రజాకవులు మిగుల్తారు
భవిష్యత్తును పరిపాలిస్తారు.

## వేం ఇక్కడ ఉన్నాం

ప్రతిక్షణం
శత్రువు నీచపు రాజకీయాల్నీ
ప్రజావ్యతిరేక చర్యల్నీ
అధికార మదాంధకారాన్నీ
గుర్తిస్తూ
కాళ్ళని కరిచే కటికరాళ్ళూ
కళ్ళని పొడిచే కటికచీకటీ
ఒంటిని గీరి రక్కే తుప్పలూ డొంకలూ
కొమ్మలమీంచీ పుట్టల్లోంచీ బుస్సుమనే సర్పాలూ
దూరదూరంగా దగ్గరగా వెన్నుపూసల్లోంచి
భయాన్ని పాకించే అడవిమృగాల అరుపులూ
వీటిమధ్య ప్రాణాన్ని బులెట్‌గా వదిలే మీరు
భవిష్యత్ దార్శనికులారా

కాంతిపుంజాల్లారా
మిత్రులారా
మీవెంట ఎక్కువమంది లేరనీ
మీకభయమిచ్చేవారూ
మీకోసం కళ్ళు లాంతర్లుగా చేసుకున్నవారూ
ఇక్కడెవరూ లేరనీ
క్షణంలో సగంలోకూడా అనుకోకండి

ఆఫీసుల్లో
ఫ్యాక్టరీల్లో
విశ్వవిద్యాలయాల్లో
సందుల్లో గొందుల్లో
పల్లెటూళ్ళలో పట్టణాలలో పత్రికల అక్షరాలలో
ఎక్కడబడితే అక్కడ

మీరుతీసే ఊపిరి చివర
మేమంతా ఇక్కడ వున్నాం

మీరేం ఆదేశించినా
ఉపదేశించినా
నిప్పుల్లో దూకడానికీ
నిప్పుగా మండడానికీ
ఇక్కడ
మేమంతా ఉన్నాం.

## ఇప్పుడు వాడికి కావలసింది....

పెద్దచేప చిన్నచేపని మింగి మరింత పొట్టపెంచడం
సహజమైపోయినప్పుడు
నరమాంసం రుచిమరిగిన నయామహర్షులు బలహీనుల్ని
నూనెలో వేయించుకుని కరకరా తింటున్నప్పుడు
అగ్రరాజ్యాలు బీదరాజ్యాల్ని ధృతరాష్ట్రకౌగిలిలో బంధించి
మానవత్వం గురించి మాట్లాడుతున్నప్పుడు
సరిహద్దులు చెరిగిపోయి
రక్తబంధాలు తెగిపోయి
ఆలోచనామృతాలు ఒలికిపోయి
మనోనేత్రాలు పేలిపోయి
పక్కవాడిమీద కసిని కసిగా దట్టించిన
పాటన్ టాంకులూ
జెట్ ఫైటర్లూ
మానవ మస్తిష్కం ప్రభవించిన
విజ్ఞాన సుజ్ఞానశాస్త్రం యావత్తూ
నేలనేలంతా గాలిగాలంతా హాహాకారాలతో
మానవకళేబరాల కబేళాలుగా తయారుజేస్తున్నప్పుడు
చిన్నవాడికి
చితికిపోయిన వాడికి
హక్కున్నా గొంతులేనివాడికి
చేతులున్నా పిడికిలించలేనివాడికి
బలహీనుడికి
బక్కచిక్కిపోయినవాడికి
చెరచబడినవాడికి

దరిద్రుడిగా చెయ్యబడినవాడికి
దిక్కులేకుండా తరిమివెయ్యబడ్డవాడికి
అందించవలసిందీ
పంపించవలసిందీ
సందేశాలూ
సౌజన్యపూరిత వాక్యాలూకాదు
శుష్కప్రియాలూ శూన్యహస్తాలూ కాదు
ఉత్సవాలూ ఊరేగింపులూ కాదు
ఇప్పుడు వాడికి కావలసింది
ఆయుధాలు.

## విప్లవ జీవితం

బీనా

ఆకాశం కప్పు
అడవి ఇల్లు
పుడమి పడక
ఆశయం ఆహారం
ఆరని అగ్ని జీవితం
ప్రతి విప్లవకారునికి.

( ఒక చైనా గీతి ఆధారంగా )

కథలు :

# బంగ్లా దేశ్

చంద్రశేఖర్

బంగ్లాదేశ్ మీదవేసిన ప్రత్యేక సంచికకుకాను శరణార్థిశిబిరాల గురించి పంపిన రిపోర్టును మెచ్చుకుంటూ పత్రిక ఆఫీసునుంచి ఆరోజే ఉత్తరం వచ్చింది. ఆ రిపోర్టు చదివి తాము చాలా చలించామని, పాకిస్థాన్ నాయకులు బంగ్లాదేశీయులను పెట్టిన బాధలు వ్యాసకర్త కళ్ళకు కట్టినట్లు వర్ణించారని అనేకమంది పాఠకులురాసిన ఉత్తరాలను నాకు పంపిస్తూ, వాటితోపాటు నాకు 'రెమ్యునరేషన్'గా రు. 500/- కు ఒక చెక్ పంపించారు మా ఎడిటర్. ఆ 'చెక్' కేష్ చేసుకురమ్మని మా 'బోయ్'వి పంపించి, పాఠకుల ఉత్తరాలు తిరగేయసాగేను, " .... .... ఆ వ్యాసం చదువుతూన్నంతసేపు శరణార్థులతో మాట్లాడుతున్నట్లే ఫీలయ్యాం మేం. ముఖ్యంగా 'రహ్మత్ఆలీ' తో వ్యాసకర్తచేసిన ఇంటర్వ్యూ చదువుతున్నంత సేపు మా చెల్లెలి కళ్ళవెంట కన్నీళ్ళుకారి పోతూనేవున్నాయి .... .... మేం వెంటనే లఖింపూర్ శరణార్థి శిబిరానికి 50 రూ.లు విరాళంగా పంపించాం" .... ....ఉత్తరాలు చదువుతూవుంటే నేను లఖింపూర్ వెళ్లడం .... ....ఆ శిబిరాన్ని దర్శించడం గుర్తుకు రాసాగేయి.

*  *  *

బంగ్లాదేశ్మీద ప్రత్యేకసంచిక వేస్తున్నామని, వెంటనే సరిహద్దుల్లోని శరణార్థి శిబిరాలని సందర్శించి రిపోర్టు పంపమని పత్రిక ఆఫీసునుంచి 'రిక్విజిషన్' వచ్చింది ఆరోజే. ఆ తర్వాతరోజే లఖింపూర్ శిబిరాన్ని అమెరికన్ సెనేటర్ల బృందం సందర్శించబోతున్నట్లు ఆ రోజుకే నేనూ 'లఖింపూర్' చేరుకోగలిగితే బాగుంటుం దన్న 'సజెషన్'కూడా చేశారు. ఎంత కాదనుకున్నా, అమెరికన్ సెనేటర్లు వచ్చిన రోజంత పకడ్బందీగా రోజూ ఏర్పాట్లుండడం కష్టం. నేను పంపించే రిపోర్టుకూ్కడా కొంత నిండుతనం వస్తుంది. ఆ వుద్దేశంతోనే రాత్రికి రాత్రి ప్రయాణమై కలకత్తా నుంచి లఖింపూర్ చేరుకున్నాను.

ట్రెయిన్ లఖింపూర్ చేరేసరికి తెల్లగా తెల్లారిపోయింది. నా లగేజి అంతా దగ్గర్లో ఉన్న ఓ లాడ్జింగ్లో పడేసి, కాలకృత్యాలు తీర్చుకొని ఎనిమిది గంటలకల్లా రెడీ అయిపోయాను. ఊరికీ, శరణార్థుల శిబిరానికీ కనీసం నాలుగుమైళ్ళైనా వుంటుం దిట. మరింకేమీ సాధనం కనపడక ఓ గుర్రబ్బగ్గీ కట్టించుకొని బయలుదేరాను.

శరణార్థిశిబిరం చేరేసరికి 9 గంటలైంది. అప్పటికింకా అక్కడికి అమెరికన్ బృందంరాలేదు. గేటుదగ్గర నన్నునేను పరిచయం చేసుకుని నా క్రెడిన్షియల్స్‌ని చూపించి, పర్మిషన్ తీసుకుని లోపలికి పోయేసరికి శరణార్థులంతా పెద్దక్యూలో నిలబడి పాలుతీసుకుంటున్నారు. క్యూలో కనీసం 500 మందేనావుంటారు. చింపిరి తలలూ, చిరిగిన గుడ్డలూ, పీక్కుపోయిన కళ్ళూ. జీవంలేని మొహాలూ - వాళ్ళూ— శవాల్లా వున్నారంతాను. చిన్నాపెద్దా, ఆడామగా అన్లేకుండా అంతా క్యూలో నిర్జీవంగా నిలబడి వున్నారు. ప్రతివాళ్ళ చేతిలో ఓ చిన్నడబ్బా. ఆ డబ్బాలెంత అసహ్యంగా వున్నాయో. క్యూ మొదట్లోకి చూశాను ఓ 'వలంటీరు' ఓ డబ్బాలోముంచి ఓపెద్ద పాత్రిలోంచి పాలుతీసి పోస్తున్నాడు వరసగా అందరికీ. అతనంత నిర్వికారంగా ఉండగలగడం చూస్తే ఆశ్చర్యమేసింది నాకు. ఇంతలో ఎవరో— రెండోచేతితో ఇంకోడబ్బా ముందుకునెట్టారు. పాలుపోసేవాడు అలవాటు ప్రకారం. కాని పాలుపోయడం అయి పోయాక తలపైకెత్తిచూసి వ్యవహారం కనిపెట్టేశాడు. ముందుకుపోతున్నవాణ్ణి పట్టుకు వెనక్కిలాగి బండబూతులు తిట్టాడు. అతని బెంగాలీయాసచూస్తే గొప్ప సరదావేసింది నాకు. ఆ పాలుతీసి మరొకడి డబ్బాలోవేసి పంపించేశాడు వలంటీరు.

'క్యూ'కేసే చూస్తున్నాను. ఓ ముసలమ్మ, డెబ్బై ఏళ్ళుంటాయనుకుంటాను. తనవంతు పాలుపోశాకకూడా కదలడంలేదు. మరికొంచెంపోయవా అన్నట్లుచూస్తోంది వలంటీరు తలపైకెత్తాడు. ఆ ముసలమ్మ ఏమీలేదన్నట్టు ముందు కెళ్ళిపోయింది. ఆ క్షణంలో- ఆ ముసల్దాని కళ్ళల్లో కనిపించిన భయంచూస్తే, గుండెల్ని పిండేసినట్ల యింది నాకు. అలా ఆలోచిస్తూ ఉండిపోయాను.

ఇంతలో బయట కార్లాగిన శబ్దం వినిపించింది. అమెరికన్లు వచ్చారు. త్వర త్వరగా బైటికివెళ్లాను. వాళ్ళందర్నీ పత్రికా విలేఖరులకు పరిచయంచేశాడు వాళ్లతో వచ్చిన పబ్లిక్ రిలేషన్స్ శాఖమనిషి. నేనుకాక మరిద్దరు మాత్రమేవున్నారు పత్రికల వాళ్ళు. ఆ బృందంలో అరుగురు సభ్యులున్నారు. అందరూ సెనేటర్లే. ఆ బృందం నాయకుడు క్రిస్టఫర్. అరవైఏళ్ళుంటా యనుకుంటాను. అతను మాట్లాడే పద్ధతిచూస్తే ముచ్చటేసింది నాకు. గబగబా మాట్లాడేస్తాడు. అవతలవాళ్ళనిట్టే నవ్వించగలడు. ఆ పది పదిహేను నిముషాల్లోనే అందరి దృష్టినీ ఆకర్షించగలిగాడు క్రిస్టఫర్.

"అన్నట్లు మనం టైంవేస్ట్ చేయకూడదు. పదండి శిబిరంలోకి పోదాం" అన్నాడు క్రిస్టఫర్— టీలు సేవించడం అయిపోగానే.

అందరం శరణార్థులకేసి నడిచాం. ఇంకా చాలామంది ఆ'పాల'కోసం క్యూలో నుంచునివున్నారు. మేం ఆ క్యూదగ్గరకు వెళ్లాం. ఆ అమెరికన్లని చూసి బెదరిపోయి వట్టున్నారు వాళ్ళంతాను. చేతులెత్తి దణ్ణాలు పెడుతున్నారు. నిజంగా 'క్రిస్టఫర్' ను చూస్తే ఎవరికేనా అలాగే అన్పిస్తుందనుకుంటాను. చెయ్యెత్తు మనిషి. తెల్లగా గంభీరంగా వుంటాడు. పెద్దనుదురు. పెద్దపెద్దకళ్ళు. ఎప్పుడూ పెదాలమీద నాట్యంచేసే చిరునవ్వు. చూడగానే ఎంతోమంచివాడని అన్పిస్తుంది ఆయన్నుచూస్తే.

'ట్రాన్స్‌లేటర్'ను ఒకణ్ణి పక్కనపెట్టుకొని ఆయన శరణార్థులతో మాట్లాడ్డం మొదలుపెట్టాడు. నిజంగా శరణార్థులపట్ల, వారి కష్టాలను తెలుసుకోవడంపట్ల ఆయన చూపించిన శ్రద్ధచూస్తే నాకు చాలా ఆశ్చర్యమేసింది. ఇదివరలో నేను యిలాంటి 'డెలిగేషన్లు' కేవలం 'షోమాన్‌షిప్'కే అంకితమైనవనుకుంటుండేవాణ్ణి. ఆయన అలా కాక హృదయపూర్వకంగా శరణార్థుల బాధలకు స్పందించడం చూస్తే నాకు వళ్ళు జలదరించింది. మన దేశీయులను ఆయనతో పోల్చిచూస్తే అసహ్యం వేసిందికూడాను. నిజానికి "ఓ ఎనభైఏళ్ళ ముసిలాడు పాకిస్థాన్ సైనికులు తననెలా హింసించిందీ, తన యింటికి వాళ్లు అర్థరాత్రి నిప్పుపెడితే ఆ మంటల్లో తన ఇద్దరు కొడుకులూ, కోడళ్లూ, తన చిన్నకూతురూ కాలి బూడిదపడం"— అంతా వర్ణిస్తుంటే ఆయనకళ్ల చెమర్చాయి. మరికొంతసేపు ఆయన శరణార్థులతో మాట్లాడేక శిబిరం నిర్వహిస్తున్న అధికారితో మాట్లాడేరు.

'శిబిరంలో వెయ్యిమందికి పైగావున్నారని ఎంత ప్రయత్నించినా సప్లైలు బాగా సరిపోవడంలేదనీ, స్థానిక ప్రజలుకూడా ఎంతో సహకరిస్తున్నారని, అంతర్జాతీయ సహకారంలేనిదే భారత ప్రభుత్వానికి యీ శరణార్థి శిబిరాల నిర్వహణభారం భరించ రానిదవుతుందనీ' చెప్పారు శిబిరం అధికారి.

క్రిస్టఫర్ కొంచెం బాధపడ్డట్టు కనిపించారు. ఆయన బృందం సభ్యులు మాట్లాడబోతుంటే వారినివారిస్తూ అమెరికాలో నూటికి తొంభైమంది బంగ్లా శరణార్థుల పట్ల జాలితోవున్నారని, పాకిస్థాను ప్రభుత్వంతో ఉన్న సౌహార్ద సంబంధాల దృష్ట్యా అమెరికన్ ప్రభుత్వం ప్రత్యక్షంగా ఏమీచేయలేకపోతూన్నదని, దీన్ని అపార్థంచేసుకోడం తగదనీ, నిజానికి రాబోయే రెండునెలల్లో శరణార్థుల పోషణకు అమెరికా నుంచి ఎవరూ ఊహించనంత సహాయం అందుతుందనీ తెలియచెప్పారు.

ఆయన తన్ను అపార్థం చేసుకున్నారని శిబిరం అధికారి గుర్తించి, తన ఉద్దేశం అంతర్జాతీయ సహకారంలేదని కాదని, కాని రోజురోజుకూ శరణార్థుల సమస్య

పెరుగుతున్నదృష్ట్యా సహాయంకూడా పెరగాలన్నకోరిక తాను బయటపెట్టానని చాలా ఎపాలజెటిక్‌గా చెప్పారు.

క్రిష్టఫర్ బృందం వారప్పటికప్పుడు ఆ శిబిరానికి 1000 డాలర్ల సహాయం ప్రకటించారు. తమవెంట తెచ్చిన బట్టలు, పాలపొడులు వగైరాలనుకూడా శిబిరానికి వారు యిచ్చివేశారు వెంటనే తాము వేరేశిబిరాన్ని సందర్శించాల్సిన అవసరం ఉందని చెప్పి వారుచాలా 'క్విక్'గా సర్దుకుని తమకారుల్లో వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళిపోయాక నేను శిబిరం నిర్వహిస్తున్న అధికారులుండేవైపు వెళ్లాను. వాళ్ళంతా 'లంచి'కి వెళ్లారులావుంది ఒకరుమాత్రం అక్కడేవున్నారు. ఆయన గొప్ప తమాషామనిషి. మనం అడిగిన విషయం తప్ప మరెన్నైనా చెప్తాడు. ప్రశ్న వేసిన పాపానికి ఆయన చెప్పేదంతా వినాల్సివచ్చింది నాకు.

"ఏమండీ, శిబిరం నిర్వహణ గురించి ఏమైనాచెప్తారా?" అని అడిగాను నేను.

"ప్చ్ ఏంచెప్తాం లెద్దురూ"— అంటూ మొదలెట్టాడాయన. "అసలు ప్రపంచ చరిత్రలోనే నూతనాధ్యాయాన్ని సృష్టించిన మహత్తర చారిత్రిక ఘటన బంగ్లాదేశ్ పోరాటమని నిర్వివాదంగా చెప్పడానికి నేను సందేహించను. ఒకానొక ఇన్స్యూరెన్సు ఏజెంటు యింత ప్రాధాన్యంగల పోరాటాన్ని ముందువరసలో వుండి మొదలుపెట్టా డంటే ప్రపంచంలోని యావత్తు సామాన్యప్రజానీకం (యిన్స్యూరెన్సు ఏజెంట్లు అంటాడేమోనని నేను భయపడ్డమాట వాస్తవం సుమండీ!) తలెత్తుకు తిరగదగ్గ గర్వ కారణమైన విషయమంటే నమ్మండి ... ...."

ఆ బెంగాలీ భాషను ఖూనీచేస్తూ అదోతరహా యాసలో అతను మాట్లాడుతుంటే నాకు అదోతమాషాగావున్నా టైం వృధాఅయిపోతోందే అని చిరాకూ్కడా కలిగింది.

"చూడండీ, శిబిరంలోకి శరణార్థులనెలా తీసుకొనేదీ, వాళ్ళ ఆహారపానీయాది సౌకర్యాలనెలా రెగ్యులేట్ చేసేదీ చెప్తే బాగుంటుందేమో" అన్నాను కొంచెం చిరాకు ధ్వనిస్తూ.

"ప్చ్, ఏమిటిలెద్దురూ, అసలు మనవాళ్లు వెధవలండీ, ప్రపంచ చరిత్రలో గత మూడువేల సంవత్సరాల కాలంలోను పొరుగుదేశంలో యుద్ధం జరుగుతుంటే యీపద్ధతిని సరిహద్దులు తెరచుక్కూచున్న పకీర్ దేశం మరొకటిలేదనడం అతిశయోక్తి కాదనుకుంటాను. వస్తున్నవాడు శరణార్థో, గూఢచారో, గూండా ముండాకొడుకో

అన్న విచక్షణ, వివేచన, వివేకజ్ఞానం (యిదతనిమాటే సుమండీ) లేకుండా ఎవడో ఒకడువచ్చాడు అంతే చాలన్నట్లు సరిహద్దుల్లో కనపడ్డ ప్రతీవాణ్ణి పట్టుకొచ్చి శరణార్థి శిబిరాల్లోకిచేర్చారు. ఇంత అవివేకానికి యాభైకోట్ల భారతీయులని, ముఖ్యంగా నాలుగు కోట్ల బెంగాలీలని బలిపెడ్తున్న యీ ప్రభుత్వాన్ని చరిత్ర క్షమించదనడం నిస్సందేహమైన విషయం. మాశిబిరం సంగతిమటుకు నేనుచెప్తాను. ఇక్కడవున్న పధ్నాలుగు వందలమంది శరణార్థులలో పన్నెండుమంది దొంగవెధవలుగా మూడురోజుల పరిశీలన అనంతరం నగ్నంగా బయటపడ్డారు ......."

తల బొప్పికట్టిపోయింది నాకాపాటికే. "ఇప్పుడు చేసేదేముంది చెప్పండీ, గతజలసేతుబంధనం అన్నారు మనవాళ్లు. ఇంటర్నల్ సెక్యూరిటీయాక్ట్— యిందుకోసమే మన ప్రభుత్వం ప్రవేశపెట్టింది కూడాను. సరిహద్దుల్లో కూడా స్క్రీనింగ్ చేశాకే శరణార్థుల్ని రానిస్తున్నారని విన్నాను. మొదటిరోజుల్లో పొరబాట్లు ఎవరికైనా సహజం కదా" అన్నాను. నాకే ఆశ్చర్యమేసింది నాగొంతు ధ్వనిస్తున్నతీరు. పోట్లాడుతున్నట్లుంది అతన్తోటి.

"అవుననుకోండి ..." అంటూ నసిగాడతను "నేననేదల్లా .... అనవసరంగా ఎంతమంది వెధవల్ని మేపుతున్నామోనని"

చాలా బాధేసింది నాకు. ఓపక్క దేశదేశాలవాళ్ళు మనదేశం త్యాగనిరతిని నిండు హృదయాలతో కీర్తిస్తుంటే మనదేశస్థుల్లో కొందరి ఆలోచనలిలా తగలడ్డాయి. 'అల్పబుద్ధివాని కధికారమిచ్చిన'.... అంటే యిదేకామోసు. దొడ్డజన్మకానిది దొడ్డగుణమెలా వస్తుంది?

ఇక ఆయన్తో మాట్లాడ్డం అనవసరం అనిపించి శరణార్థుల్నెవర్నేనా ఇంటర్వ్యూ చేస్తాననిచెప్పి ఆయనదగ్గర శలవుతీసుకుని బయటపడ్డాను.

అప్పటికి 12 గంటలైంది. శిబిరం చుట్టుపక్కల ప్రదేశం, శిబిరం నిర్మాణం చూద్దామనిపించింది. అంత ఎండలో బయటతిరిగేకన్నా యింటర్వ్యూలు పూర్తిచేసుకుని సాయంత్రం- ఆపని పూర్తిచేద్దామనుకున్నాను. నాకు సాయంత్రం 6 గం॥లకు మళ్ళీ ట్రెయినుంది. ఆటైమ్‌కు అందుకోవచ్చుకూడాను.

శరణార్థులుండేవేపుకు నడిచాను అందులోకూడా కుటుంబాలున్నాయి కామోసు. నలుగురు ముగ్గురు చొప్పున అంతా గ్రూపులుగా విడిపోయి కూర్చునివున్నారు. వాళ్ళంతా ఏదో మాట్లాడుతూనేవున్నా అందులో ఏమాత్రం జీవం కనిపించలేదు నాకు.

అలా వాళ్ళకేసిచూస్తుంటే వాళ్ళందరికి దూరంగా ఒక్కడేకూర్చుని కళ్ళల్లో నీళ్ళు తుడుచుకుంటూ కనిపించాడొకడు. ఏభై, అరవై ఏళ్లుంటాయనుకుంటాను. ఎఱ్ఱటి కళ్ళు నల్లటిపళ్లు, తెగిపోయి గడ్డిదుబ్బులావున్నజుట్టూ- భయంకరంగా వున్నాడు. వంటిమీద ఒకపేగుడ్డ, గోచీపెట్టుకున్నాడు. ముందుగా అతనితో మాట్లాడదామనిపించి అతని దగ్గరగా వెళ్లాను.

"నీ పేరేమిటి బాబూ" అన్నాను నెమ్మదిగా

ఆదోలా చూశాడతను.

మళ్ళీ అడిగాను "నీ పేరేమిటి?" అని.

"నాపేరా? నాపేరు రహ్మత్ఆలీబాబూ" అన్నాడు. అంటూ నీకుదేనికి అన్నట్లు చూశాడతను నావేపు.

"నేను-మీగురించి పత్రికల్లోరాస్తాను. నీ ఫోటోకూడావేస్తాను"అని చెప్పానునేను.

అర్థమైనట్లు తలూపాడతను.

"నీ విక్కడికెలావచ్చావో. నీయిల్లూ వాకిళ్లు ఎందుకు వదలివేసివచ్చావో కొంచెం చెప్తావా?"

"ఇంకేటి యిల్లుబాబూ.... నా యింటికి నిప్పెట్టేసినారు బాబూ.... బాబోయ్ నాయిల్లో" అంటూ ఏడుపు లంకించుకున్నాడు.

"చూడుబాబూ, యిల్లు తగలెట్టేరు అన్నావుకదా, ఎవరు తగలెట్టారు, ఎందుకు తగలెట్టారో కాస్తచెప్తావా?".

"ఎందుకేటి బాబూ నాఖర్మ.... నాఖర్మ అలావుంది. నానుదుట అల్లా అట్లా రాసిపెట్టాడు— లేకపోతే నేనేటి దొంగతనం చేశానా. దురమార్గం చేశానా ఆళ్ళమ్మ ఆళ్ళ పెళ్ళాల్నెత్తుకొచ్చానా బాబూ.... నేనాళ్ళకేవ(పకారం చేసినానని, నంజికొడుకులు నాయింటికి నిప్పు ... బాబోయ్ నాయింటికి నిప్పెట్టేసినారు బాబోయ్...."

"ఆ నిప్పెట్టిందెవరు బాబూ"

"ఆళ్ళేబాబూ, ఆ కాకీచొక్కాలోళ్లు మిలిట్రీపోలీసు బాబూ, ఉక్కటోపీలు ఆళ్లు నాయాళ్లు ఎద్దుల్లాగుంటరు. ఆళ్లమొకం నేనెరగనే.... నాయింటికి నిప్పెడ్తమేటి బాబూ.... యీలోకంలో నేనేదొరికిన్నా? ఎవణ్ణనేటిది బాబూ నాకర్మమట్టాగుంటే" అంటూ నుదురు బాదుకోవడం మొదలెట్టాడు. అంతలోనే మళ్ళీ ఏడుపు లంకించుకున్నాడు.

ఎంత ప్రయత్నించినా మరి జవాబు చెప్పలేదతను. ఇదీగోల వీళ్ళతోటి. ఈమధ్య వరదలప్పుడూ అంతే విషయం చెప్పకుండా ఏడుపు. వీళ్ళకు చదువూ సంధ్యా, లోక జ్ఞానం లేకపోవడం కాదుగాని మాచావుకొస్తుంది, వీళ్ళను యింటర్వ్యూ చెయ్యాలంటే.

"చూడు బాబూ అలా నీవిలా బాధపడనక్కర్లేదు ప్రపంచం అంతా మీదుస్థితి చూసి పరితపిస్తోంది. తప్పకుండా మీరు మీయిళ్లకు తిరిగిచేరతారు. మీకష్టాలు కలకాలం వుండవు. మిమ్మల్నింత ఏడిపించిన కిరాతకులేనాటికి జయించరు ..." అంటూ కాస్త అనునయించ జూశాను.

నేను చెప్పిందేమీ అతనికర్థమైనట్లు కనిపించలేదు నాకు. కాని కళ్ళనీళ్లుతుడుచు కుంటూ "యింకేటి కావాలిబాబూ మీకు" అన్నాడు

"మరేంలేదు. వాళ్ళు మీయిళ్ళెందుకు తగలెట్టారోనని?".

"నాకేటి తెలుసుబాబూ. మావూరు.... మా వూరంటే ఎంత. యీవూల్లో సగం కూడా వుండదు. ఓ రెండువంద లిళ్లుంటాయి గామోసు. ఆరోజు బాబూ యింటికాడ కూకున్న సాయంత్రం పూట. నాకొడుకింకా పొలంనుంచి రాలేదు. రెండు జీపుల్లో వచ్చిన్రు పోలీసోళ్లు నన్నూ మానుట్టు పక్కలిళ్ళోళ్లని అందర్నీ లాక్కపోయిన్రి ఊరిమధ్యలోకి. ఎవరో కుర్రోళ్లంట ప్రభుత్వంమీద పోట్లాడుతున్నరంట ఆళ్ళకాడ తుపాకులుగూడున్నయ్యంట బాబూ ఆళ్లు మీవూళ్ళవున్నరు సూపించండి అంటరు మాకేటి తెల్వు బాబూ. ఎర్రిముండోల్లం, తెల్దన్నం. ఒక్కొక్కణ్ణి పట్టుకు చావబాదిన్రి బాబూ, చావబాదిన్రు ఇదుగో యిటుసూడు బాబూ యీడ, యీ యెనక, యీవుమీద కనిపించిందా.... చర్మం లేసిపోయింది చూడు అదిబాబూ. ఆళ్లకర్ర, లాఠీకర్రంటుర్రి ... దాన్తో బాదినదెబ్బ అది, అంతేబాబూ— అందర్నీ. పెద్దోళ్ళని సిన్నోళ్లని అందర్నీ బాదిన్రి ఎవరి కేటితెల్వగనక ఏటిసెప్తరు బాబూ. కొట్టికొట్టి యిసుగేసుంటదో, వాళ్ల సేతులు నొచ్చినయ్యో బాబూ, అదిమవ్వ సూణ్లేదుగాని గోరంబాబూ పిల్లలు, ఆడోళ్లు గగ్గోలుగ కేకలేత్తుంటే పేణం గిలగిల్లాడిపోనాది బాబూ అంతా అయినాక నాలాంటోళ్ల నొదిలిన్రి. మా శ్యామ్‌లాల్, రమేశ్ భయ్యాల్లాంటోల్లని కాస్త వయసులోవున్నోల్లనేమో జీపుల్లో యెక్కించుకుపోయిన్రు బాబూ, అప్పటికి పీడావదిలిందిగదా అనుకున్నా బాబూ ...... అరాత్రేబాబూ, అరాత్రికి రాత్రి ... నాయింటికి నిప్పెట్టిన్రు బాబూ... నాయిల్లు బాటోయ్ నేనేమవుతాన్రో దేవుడో.... ...'

కాస్త విషయం చెప్పాడుగదా అనుకుంటే మళ్ళీ ఏడుపులంకించుకున్నాడు. "ఇదేం ఖర్మరాబాబూ" అని నేననుకుంటుంటే హఠాత్తుగా మొదలెట్టాడు.

"నా కొడుకు బాబూ, నా కొడుకు— రెండ్రోజులు చూసిన్నా, గానీ ఆడాళ్లేదు బాబూ. నా కోడలు తనబ్బకాడికి తానుపోయింది నాకర్మమేంరా భగమంతుడా అని నేను తిరుగుతుంటే యీడ తిండి పెడుతున్నరని యవరో సెప్పిన్రు. యీడొచ్చి పడ్డాను బాబూ...."

అతని కొడుకు ముక్తిఫౌజ్ మనిషన్నమాట. అదీ సంగతి. అదిచెప్పిచావడేం? నేనే అడిగాను "నీకొడుకింటి కెందుకురాలేదూ" అని

"ఏటొస్తడు బాబూ, మా శ్యామ్‌లాల్. రమేశ్‌లను పట్టుకుపోయినార్రి, ఆళ్ల నందర్నీ అ మర్నాడే– ఆ మర్నాడే "రంజిత్‌పూర్" లో కాల్చి చంపేసినుర్రి బాబూ. ఎవడి పాణంమీది తీపి ఆడిది. వూళ్ళో కుర్రోర్రిళ్లనందర్ని పట్టుకుపోతరని అనుకుంటున్నారు. మావోడికీ అదేభయం".

"ఏమిటీ ఏవూరూ? రంజిత్‌పూరా?"

"అవును బాబూ రంజిత్‌పూరే. మొత్తం పదిహేను మందినంట బాబూ కాల్చి చంపిసర్రిట".

"ఇంతకీ నీదేవూరు?"

"నాదా, నాది రాజానగర్ బాబూ"

తల తిరిగిపోయింది నాకు. రంజిత్‌పూర్, రాజానగర్ రెండూ భారతదేశంలో పశ్చిమ బెంగాల్లో జల్పాయిగురి జిల్లాలో గ్రామాలు.

"నీది బంగ్లాదేశ్‌కాదా?" అని అడిగాను గాభరాగా.

"నాది రాజానగర్ బాబూ, శచీన్‌పూర్ తాలూకా".

టంగ్ టంగ్‌మని గంటకొట్టారు. ఆదరాబాదరాగా పరిగెత్తాడతను. అన్నం గిన్నెపట్టుకొని, పిలుస్తున్నా వినిపించుకోకుండా.

అందరికీ భోజనం కైంకదా అని నేనూ హోటల్‌కి వచ్చేశాను. ఇంతకష్టపడి రాసుకున్న నోట్స్ ఏంచేయడమూ అన్నది పెద్దబాధైపోయింది నాకు.

* * *

ఆ సమస్య కలకత్తా వచ్చేకకాని తెగలేదు. మా రతీన్ సలహాయిచ్చాడు. 'అంత మంచినోట్స్ పారేసేకన్నా, బంగ్లాదేశ్‌లో వూళ్ళపేర్లతో పంపిస్తే మంచి ఎస్సే తయారవుతుందని, బంగ్లాదేశ్‌కు చాలా సహాయంచేసి బెంగాలీగా నాబాధ్యత తీర్చుకో వచ్చునని'.

* *

ఆ సలహా ఫలితమే నేను ఆ ఎస్సే రాయడం, యీ ప్రశంసలూ, యీ పారితోషికమూ.

వెంటనే రతీన్‌కు రింగప్‌చేశాను. "ఈ రాత్రి, త్రీ ఏసెస్‌లోపార్టీ, విత్ ది గర్ల్ యూచూజ్.... ఓకె" అంటూ.

# జైలుగది ఆత్మకథ

ఓల్గా

జైలుగది మరల నిట్టూర్చింది. ఔను! జైలుగది తరచుగా నిట్టూరుస్తూ వుంటుంది. కొత్త మనుషులు వచ్చినపుడు పాతమనుషులు పోయినపుడు— కొత్త అనుభవాలు పాత అనుభవాలను నెట్టేసినపుడు— కొత్తబాధలు పాతబాధలను విముక్తిచేసినపుడు కొత్త అన్యాయాలు పాతవానిని అతిక్రమించినపుడు— జైలుగది నిట్టూరుస్తూనే వుంటుంది. తనను కట్టినపుడే అనుకుంది ఆగదినన్నిలా ఎత్తుగా వెలుతురుకూడా సోకకుండా ఎందుకు కడుతున్నారా అని. అనుకున్నట్లుగా అది జైలుగదే ఐంది అప్పటినుంచీ అది నిట్టూరుస్తూనే వుంది.

"ఎందరో వస్తుంటారు, పోతుంటారు. తనను కట్టినపుడే యింకా తన కొత్త వాసన పోకముందే వచ్చాడొక ముసలితాత. దొంగతనం చేసాడట యజమానియింట్లో. ఎప్పుడూ ఏడుస్తుండేవాడు కాళ్ళుపడిపోయిన ముసలిదాన్ని తలుచుకుని. ఎందుకు చేసాడో దొంగతనం—— తెలియదూ తనకోసం ఇట్లాంటి గదులుకట్టి వుంచుతారని, ఇంతభయంకరమైన జీవితం తనకోసం ఎదురుచూస్తుందని తెలిసే ఆపని చేసాడంటే అతని ఆకలి ఎంత భయంకరమైనదో! అతని అవసరాలు ఎంత క్రూరమైనవో! ఎట్లా తప్పించుకుంటాడు ఆకలినుంచి? దానికి మార్గం చూపించకూడదూ నన్నిట్లా ఎత్తుగా కట్టిపడేయకపోతే! ఇక్కడ పడేసేముందు బాగా కొట్టినట్లున్నారు. ఆ దెబ్బలకోసం ఎన్నడూ ఏడవలేదు. ముసలిదానిగురించే బాధంతా. పోయేరోజుకూడా ఎంత ఏడ్చాడు— వెళ్ళేసరికి అది బతికుంటుందో లేదోనని. ఏమయిందో ఆ ముసలిది? ఎట్లా బ్రతుకుతున్నారో వాళ్లు. వెళ్ళేసరికి ఆ ముసలిది చచ్చిపోయి వుంటే ఏమౌతాడు ఆ తాత. తనకు జరిగిన అన్యాయానికి లోకాన్ని శపిస్తాడేమో— హత్యలు చేస్తాడేమో— ఇంకెంత కఠినంగా మారుతుందో అతనిమనసు- లేకుంటే ఒక్కసారి బావురుమని ఏడ్చి నిశ్శబ్దంగా తన జీవితాన్ని గడిపేస్తాడేమో!

ఆతాత అట్లా వెళ్లాడోలేదో తన నిట్టూర్పు అణిగిందో లేదో- ఇద్దరు యువకుల్ని తాగి తూలుతున్నవారిని తీసుకొచ్చారు బండబూతులు తిట్టుకుంటూ; ఆ యిద్దరుకూడా ఏవో అస్పష్టంగా తిడుతూనే ఉన్నారు. రాత్రంతా వారిగోలను నిశ్శబ్దంగా భరించింది తను. తెల్లవారేసరికి ఎలా మారిపోయారు? రాత్రి నిర్లక్ష్యం ధైర్యం ఏమైపోయాయో

దీనంగా మొగాలు వేలాడేసుకుని నిలుచున్నారు. ఒకడి చెల్లెలిపెళ్ళట ఆ మరునాడు. ఎంతో కంగారుపడ్డాడు అతనులేకుంటే పెళ్ళిజరగదట. బాను చూస్తూచూస్తూ జైలులో ఉన్నమనిషి చెల్లెలిని ఎవరు చేసుకుంటారు. మనుషుల జీవితాలకు కళంకం ఆపాదించే తన బతుకెంత హీనమైంది? నన్నుకట్టి నాద్వారా వాళ్ళ బతుకుల్ని రక్షించుకునేవారు ఎలాంటివారు? నేనులేకుండా నా అవసరం కలగకుండా మనుషులు జీవిస్తే ఎంత బాగుండు అప్పుడు నాలోనికి స్వేచ్ఛగా వెలుగు చల్లనిగాలీ వెన్నెలలు హాయి అన్నీ వస్తాయికదూ— ఓ మానవులారా ముందు నాకుజరిగే అన్యాయాన్ని ఆపండి. నా బతుకు నింత నీచం చేయకండి అని మొరపెట్టుకోవాలనిపిస్తుంది అప్పుడప్పుడూ ఆయువకుడు పాపం మొత్తుకున్నాడు వదిలిపెట్టమని. జీవితంలో ఎవరినీ లెక్కచేయనక్కరలేని వయసులో, ధైర్యంగా దర్జాగా బ్రతకాల్సిన యవ్వనంలో ఎట్లా దీనంగా బతిమాలు కున్నాడు కళ్ళన్నీ ఎర్రబడేలా ఏడ్చాడు. కాళ్ళమీద పడ్డాడు. కనికరం ఈ గోడల మధ్యకుకూడా రాదని అతనికెవరుచెబుతారు. చివరకు మళ్ళీతిట్లకు తలపడ్డాడు. 'వాళ్లు' వచ్చి బూటుకాళ్ళతో నాలుగుతన్నితే వెక్కి వెక్కి ఏడ్చి సొమ్మసిల్లి పడిపోయాడు. ఏం చేసింది తను నిట్టూర్పటం తప్ప ఎందుక మరి రాత్రితాగాడు? ఎందుకు వ్యభిచారం చేసాడు? ఆ పరిస్థితులు ఎందుకు కొనితెచ్చుకున్నాడు. అతనే తెచ్చుకున్నాడా? ఈ మనుషుల సమాజం బాధ్యతేమీలేకుండా అతనొక్కడే ఎలా నేరం చేయగలిగాడు? సమాజపు బాధ్యతేమీలేదా? నేనెంత నిలదీసి అడిగినా నాగోడు ఎవరికి వినిపిస్తుంది. వాళ్ళగోడవలే వినిపించుకోని మనుషులు నన్ను పట్టించుకుంటారా? కొన్నాళ్లకు ఆ యిద్దరూ వెళ్లిపోయారు. ఇక అంతేముంది ఒకరుపోతే ఒకరు. అంతో యింతో తేడాగా అందరి బతుకులూ ఒకటే. దొంగతనం చేసి, ఒళ్లు తెలియకుండా తాగి వ్యభిచరించి హత్యలుచేసి— ఎందరో వచ్చారు. అందరినీ భరించింది. మానవ చరిత్ర ప్రారంభమై యిన్నివేల సంవత్సరాలు గడిచినా నాగరికత ఎంతదూరమో పయనించినా ఎందుకు వీళ్ళు నావద్దకే వస్తున్నారు. ఎందుకు నాలోమాత్రం యింతదుఃఖం అవమానం భారం. నాకీబరువు తప్పించని ఎంతగొప్ప నాగరికతైనా ఏం ప్రయోజనం.

తనవద్దకు వచ్చిన మొదటి హంతకుడు— ఎంత జాలిగొలుపుతూఉన్నాడు మనిషి. ఎలా హత్యచేసాడో! అంత క్రూరమైనపని ఎలాచేసాడా అనిపించింది అతని కళ్ళు చూస్తుంటే. ఈ గదిలోకిరాగానే నాలుగు దిక్కులూచూసి ఒక్కసారి బావురుమని యేడ్చాడు. నావద్దకు ఎవరుమాత్రం సంతోషంగావస్తారు అనుకుంది తను అజ్ఞానంగా. రాత్రి ఒకటే కలవరించాడు. వాడిదొర ఎవడో— వాడు చెయ్యమన్నాడట. నీకేం ఫరవాలేదు నేనున్నానన్నాడట. దొర ఉప్పుతిని దొర చెప్పినపని చెయ్యకపోతే ఎంత పాపం? అందుకే దొర చెప్పినదాన్ని చంపేశాడు దొర తప్పుకున్నాడు. వీడు దొరికి

పోయాడు. దొరలు ఎప్పుడూ దొంగలూ హంతకులూ కారు. ఇన్నాళ్లయింది నన్ను కట్టి ఒక్క గొప్పవాడూ నావద్దకురాలేదు. వారందరూ పుణ్యమూర్తులు కాబోలు. ఎప్పుడూ నా వద్దకు పతితులు భ్రష్టులు దరిద్రులేవస్తారు. దరిద్రాన్ని లేకుండాచేస్తే అందరూ గొప్పవారైపోతే నాకెంతహాయి. ఈ ఏడుపులనుంచీ బాధలనుంచి విముక్తమైపోతే— ఆరోజు వస్తుందా ఎన్నడైనా? ఆ హంతకుడు ఎట్లాగో ఉండేవాడు. అన్నం తినేవాడుకాదు. ఆరోజు! ఉరితీసేరోజు— కాసేపు నవ్వాడు కాసేపు ఏడ్చాడు. జుట్టు పీక్కున్నాడు. కేకలుపెట్టాడు. చివరకు నిశ్శబ్దంగా వెళ్ళిపోయాడు. కంట్లో తడన్నా లేకుండా ఏమీ మాట్లాడకుండా నిర్లిప్తంగా నిర్వికారంగా గదినుండి నడిచివెళ్లిపోయాడు. తనగుండెనెవరో గట్టిగా పిండినట్లయింది. ఎందుకిట్లా అన్యాయాలు జరుగుతుంటాయి? నోరులేని నాకుతెలిసినంతకూడా తెలియదా వీళ్లెవరికీ. ఎందుకింత ఆవేశాలు ఆలోచనలు వీరికి. ఎవరినో చంపటం అన్యాయమంటూ మళ్లా వీడినెందుకు చంపుతారు. వీళ్ళు న్యాయాన్యాయాలకు అతీతులా? ఈ నేరానికి ఈశిక్ష అని రాసుకుకూర్చున్న వీరి నేరాలకు శిక్షలేమిటి? ఈ ఆవరణలో మాత్రం ఎన్ని అన్యాయాలు జరగటంలేదు? ఎందుకింత ఘోరంగా మారిపోతుంది మానవ సమాజం. తనుమాత్రం నిట్టూర్చటం తప్ప ఏం చెయ్యగలదు?

ఇట్లా ఎన్నోరోజులు గడచి పోయాయి. ఎన్నిబాధలో భరించింది తను. ఎందరి కన్నీళ్ళో తన ఒడిలో యింకిపోయాయి. ఎందరి కథలు గాథలు ఆవేదనలు అన్యాయాలు ఆవేశాలు— ఎన్నోచూసింది. కానీ ఒక అనుభవం మాత్రం మరచిపోలేనిది. ఆనాడు తను పులకించిపోయింది. ముందు అసలేమీ అర్థంకాలేదు. నలుగురు యువకుల్ని తెస్తున్నారువాళ్లు. తను నిట్టూర్చబోయి ఆగిపోయింది. చిత్రం! ఆ యువకులు ఏడవటంలేదు సరికదా కనీసం విచారంగాకూడా లేరు. కొందరిలా వెకిలిగా నవ్వుతూ గానీ పిచ్చిగావాగుతూగానీ రావటంలేదు. ఉత్సాహంగా చురుకుగా వస్తున్నారు. పక్కనున్న 'వాళ్ళ'కంటే కూడా ఠీవిగా నడుస్తున్నారు. తన లోపలికివచ్చి హుషారుగా 'వాళ్ళను' వీడ్కొన్నారు. ఒకతను సన్నగా పాడటం మొదలుపెట్టాడు. తక్కినవారు గొంతుకలిపారు. 'మరోప్రపంచం మరోప్రపంచం మరోప్రపంచం పిలిచింది' తనకేమీ అంతుబట్టలేదు. ఏమిటా వీళ్ళప్రపంచం అనుకుంది. పదండి ముందుకు అంటూ తన దగ్గరకు ఎందుకువచ్చారా అనుకుంది. ఆ తరువాత తెలిసింది ఆపాట పాడినందుకే ఆ బాటలో నడవాలన్నందుకే వాళ్లనిక్కడ పదేశారని. కానీ వాళ్లచేతులకు సంకెళ్లు ఉన్నా మనసులకులేవు. ఈ అన్యాయాల గురించి అధర్మాల గురించి ఎప్పుడూ విమర్శిస్తుండేవాళ్లు. ఇవన్నీ మార్చాలనేవాళ్లు. ఈజైళ్ల అవసరంలేని మరో ప్రపంచం నిర్మించాలనేవాళ్లు. అబ్బ! వాళ్లమాటలు వింటుంటే తనకెంత సంతోషం కలిగేది.

వాళ్లఊహలు ఆలోచనలు ఎంత గొప్పవి. తనపై వారికెంత అభిమానం. అంతకు ముందు తనవద్దకు వచ్చినవారు ఏదో పోగొట్టుకున్నట్టు అవమానంగా అధైర్యంగా కాలం గడిపేవారు. వీరితీరేవేరు. ఎన్నడూ విచారం వారి ఛాయలకురాలేదు. ఎందుకు మనకు భయం? ఎందుకు మనకుబాధ? మనమేం తప్పుచేశామని? అని ప్రశ్నించు కునేవారు– యితరులు వింతగాచూస్తే. దరిద్రం ఎంత భయంకరమైనదో తనలాగే వారికీతెలుసు. ఎప్పుడు దరిద్రులగురించే ఆలోచించేవారు తపనపడేవారు. తనలాంటి వారే– వాళ్లు తనలోవుంటే ఎంతబాగున్నా– వాళ్లుండవలసినచోటు యిదికాదనిపించేది. బయట గాలీ నీళ్లూ స్వేచ్ఛా జీవితం వారికి యింకెంత ఉత్సాహాన్నిస్తుందో అనిపించేది. తనకుతాను రెండుగా చీలిపోయి వారికి దారియివ్వాలనిపించేది. వెనుక ఎప్పుడో తన తలుపులు చీల్చి ఒకరికి దారియిచ్చిన జైలుగది కథ గుర్తువచ్చేది. తనకూ ఆశక్తివుంటే ఎంతబాగుండును. ఈ యువకులను ఈ ఉత్సాహాలను, ఈనెత్తురు కాల్వలను బయటకు పంపేదాన్నికదా అనిపించేది. వారు ఎప్పుడూ ఆపలేని ఉత్సాహంతో పొంగిపోతూ ఉండేవారు. బయటవున్న మిత్రుల్ని తలపోసేవాళ్లు. తన ఎత్తైనగోడలు వారినేమాత్రం ఆపలేవనుకుంది. ఔను వాళ్లు యిదికూడా పాడేవారు. 'మాకు గోడలులేవు, గోడలను పగులగొట్టడమే మాపని'. ఎక్కడా వాళ్లహృదయాలలో త్యాగం తప్ప స్వార్థం కనిపించేది కాదు వాళ్లరక్తంలో శౌర్యంతప్ప మరొకటి ప్రవహించేదికాదు. ఏవో చదివి ఎంత ఆవేశంతో కదిలిపోయేవారు. ఒకనాడు ఉన్నట్టుండి ఒకతను నిశ్శబ్దంగా మారిపోయాడు. ఒకటే బాధపడుతున్నాడు. తనకడుపు అల్లాడిపోయింది. ఆ రోజంతా అన్నం ముట్టలేదు. అతని మిత్రుడిని చంపివేశారట 'వాళ్లు' మిగతా ముగ్గురూ ధైర్యం చెప్పారు. వారి ప్రయాణం ఒకరోజుతో ఒకరిద్దరితో పూర్తికాదన్నారు. "నేస్తం! పోరాటం మధ్యలో అంతులేని కన్నీళ్ళకు ఆస్కారం లేదుసుమా!" అని భుజంతట్టారు. నలుగురూకలిపి నవ్వుతూ పాడటం మొదలుపెట్టారు "కొంతమంది కుర్రవాళ్లు పుట్టుకతో వృద్ధులు" వీరుమాత్రం అలాంటివారు కాదు. పౌరుషం త్యాగం మూర్తీభవించినవారు. వీరు ముందుతరం దూతలు. పావన నవజీవన బృందావన నిర్మాతలు– అనుకున్నది తను. కొన్నాళ్ళకు 'వాళ్లు'వచ్చి ఏవో ప్రశ్నించారు. వీరుమాత్రం స్థిరంగా సమాధానా లిచ్చారు. కొన్నింటికి మాట్లాడలేదు. విపరీతంగా కొట్టారు. ఆ లేతలేత చేతులను పాలుగారే బుగ్గలను రక్తం చిమ్మేలాచేసారు. వారు నవ్వుతూనే ఉన్నారు. ఎక్కడిది వీరికింత ధైర్యం. ఎలావచ్చింది ఈఓర్పు అని ఆశ్చర్యపోయింది. 'వాళ్లు'కూడా అదే అడిగారు. నలుగురూ ఏకకంఠంతో సమాధానమిచ్చారు. "మా ఆశయం మా మార్గం" బిగ్గరగా పాడటం మొదలుపెట్టారు. "కమ్యూనిష్టులం మేము కష్టజీవులం" వారిని విపరీతంగా కొట్టారు. ఆరోజు అర్థరాత్రి ఇద్దరినిలేపి తీసుకువెళ్లారు. మరునాడు

మిగిలినవాళ్లు చెప్పుకుంటుంటే విన్నది. వాళ్ళిద్దరినీ కాల్చివేసారట పోరాటంలో కాల్చి వేశారట. స్పృహలేకుండా కొట్టి యింకావారు పోరాడారని కాల్పులు జరిపారని చెబితే ఎవరు నమ్ముతారు ? కానీ నాకూ ఆ యిద్దరికీ తప్ప నిజం ఎవరికితెలుసు వాళ్ళిద్దరు పోయినా వీరు అధైర్యపడలేదు. ''ఎరుపంటే కొందరికి భయం భయం పసిపిల్లలు వారికన్న నభయం నయం'' అని పాడుకుంటూనే ఉన్నారు. వాళ్లున్నన్నాళ్లూ తనకుబాధ లేదు. బరువులేదు. ఎంతోగర్వంగా అనుభూతి చెందింది. వారి పసిముఖాలలోకిచూస్తూ చెప్పలేని ఆనందం అనుభవించింది. ఎవరో పవిత్రమూర్తులు తనగర్భంలో ఉన్నట్లు అనుభూతిచెందింది. వారునవ్వితే నవ్వింది. దిగులుపడితే మౌనంగా నిట్టూర్చింది. వారు కబుర్లు చెప్పుకుంటే ఆసక్తిగా విన్నది జీవితమంటే ఆసక్తిపెంచుకుంది. తనకు మంచి రోజులు వస్తాయని ఆశపడింది.

కొంత కాలానికి వారిద్దరినీకూడా తీసుకుపోయారు వారు నవ్వుతూనే ''పదండి ముందుకు పదండి తోసుకుపోదాం పోదాం పైపైకి'' అనుకుంటూనే వెళ్లారు. తనకు మాత్రం పట్టలేని దుఃఖం వచ్చింది. ఎక్కడకు తీసుకుపోతారో ఆ త్యాగధనులను. ఎట్లా కాల్చివేస్తారో. ఆ వెచ్చటి రక్తంతో ఆ మండేగుండెల రక్తం తడిసిననేలతల్లి ఎలా విలపిస్తుందో ఆమెకు ఎంతకోపం వస్తుందో. మిలమిల మెరిసే వారికన్నులలోని గర్వం కాంతి ఎలా హరించుకుపోతాయో. ఎంతకీ తనమనసు కుదుటపడలేదు. వారిపసి ముఖాలు, వారుపాడే పాటలు అన్నీ పదేపదే తలపుకువస్తున్నాయి. ఎన్ని అన్యాయాలో చూచి ఎండబారిన తనమనసు ఆరోజు విపరీతంగా చలించిపోయింది. ఆ బిడ్డలు వారి మిత్రులు ఎక్కడున్నారో యిప్పుడు. వాళ్ల ప్రపంచం ఎప్పుడొస్తుందో. తనబాధలు ఎప్పుడు విముక్తమౌతాయి.

జైలుగది నిట్టూర్చింది. ఆవేడి ఊర్పులకు గదిగోడలు బీటలువారుతున్నాయి.

విప్లవ రచయితల సంఘ ద్వితీయ మహాసభ అధ్యక్షోపన్యాసం:

# రెండు తెగలు - రెండు తెలుగులు

శ్రీశ్రీ

ఏవిటీ విప్లవం? ఎందుకీ విప్లవం?
విప్లవం ఇవాళ వీస్తున్నగాలి. లేస్తున్న కెరటం.

ఇదంటే భయపడేవాళ్ళున్నారు. అసహ్యించుకునే వాళ్ళున్నారు. దీన్ని అణి చెయ్యాలని తమ అధీనంలో ఉన్న అన్ని ఆయుధాలనూ సమాయత్తం చేస్తున్న వాళ్ళున్నారు.

వీళ్ళంతా ముసలివాళ్లు. వయస్సులో కాదు, మనస్సులో. వీళ్ళంతా నిన్నటివాళ్లు. అయితే అన్ని ఆయుధాలూ వీళ్ళచేతిలోనే ఉన్నాయి. అన్నింటినీ నిర్దాక్షిణ్యంగా ప్రయోగిస్తారు. నిన్నకివత్తాసుగా నిలిచేవాళ్ళంతా మన శత్రువులే.

ఆయుధాన్ని ఆయుధంతోనే ఎదిరించాలి. హింసని ప్రతిహింసతో ప్రతిఘటించాలి. అప్పుడే సామ్యవాద విప్లవం సార్థకమవుతుంది.

ఈ విప్లవం అనేమాట మనందరికీ ఎంతో ఉత్సాహం ఇస్తుంది. కాని మన శత్రువులకి మాత్రం ఉలికిపాటు తెస్తుంది. ఆ ఉలికిపాటులో వాళ్ళకి వివేచనశక్తి నశిస్తుంది. ఏవో కొన్నిపుస్తకాలను నిషేధిస్తారు. ఎవర్నో కొందర్ని నిర్బంధిస్తారు తమ కనుకూలమైన రచనలుచేసే వాళ్ళకి సత్కారాలూ సన్మానాలూ సాగిస్తూ ఉంటారు, మనుష్యులలో వీరిదృష్టిలో అంటరానివాళ్లున్నట్లే, మాటల్లో కూడా అనరాని మాటలుంటాయి. తమ మధ్యతరగతి సంస్కారాన్ని మించి మరిముందుకు చూడలేని ఈ ప్రబుద్ధులు అసభ్యం అనీ, అశ్లీలం అనీ, ఇంకా పచ్చిగా చెప్పాలంటే బూతు కూతలనీ కొన్నిరకం రాతలని అభివర్ణిస్తారు. మీరంటున్న అశ్లీలాలూ అసభ్యతలూ అన్నీ మీ పురాణాల్లోనే, మీ ప్రబంధాలలోనే సమృద్ధిగా దొరుకుతున్నాయి చూసుకొండర్రా అంటే, ఊఁహూఁ పురాణాలన్నీ దేవుళ్ళకి సంబంధించినవిన్నీ, ప్రబంధాలన్నీ ప్రభువులకి సంబంధించినవిన్నీ— కాబట్టి అక్కడ అశ్లీలం ప్రసక్తితెచ్చేవాళ్లంతా వచ్చేజన్మలో ఏ కుక్కలుగానో నక్కలుగానో పుడతారని శాపనార్థాలు పెడతారు. ఇది నేటిదికాదు— కొన్ని వేల, పోనీ కొన్నివందల సంవత్సరాలుగా మనలో జీర్ణించిపోయిన దురాచారం!

మనం ఏవేవన్నీ దురాచారాలంటున్నామో అవన్నీ వాళ్లకి సదాచారాలు। ఔను మరి, అవన్నీ తమకు సదుపాయంగా ఉంటూవస్తున్న యథాతథస్థితిని కాపాడుతున్న కంచుకోటలు. వీటిమీద విప్లవం ఎడతెగనిదాడి, అనుక్షణ దండయాత్రి జరుపుతూనే ఉంటుంది. తాత్కాలిక పరాజయాలు ఎన్ని తటస్థించినా అంతిమ విజయం కమ్యూనిస్టు విప్లవానిదే। ప్రపంచ చరిత్రను ఒక్కసారి పర్యాలోకనంచేస్తే మనకు కనిపించుతూన్న సుస్పష్ట సత్యమే ఇది। భాస్కరుణ్ణి మేఘాలు కబళించాయనుకుంటాము. కాని భానూదయం మాత్రం తథ్యం.

1917వ సంవత్సరందాకా కమ్యూనిస్టు విప్లవం అనేమాట కాగితంమీదమాత్రమే కనిపించేది. మార్క్స్, ఎంజెల్స్‌ల కమ్యూనిస్టు మానిఫెస్టో ఒక సైద్ధాంతిక ప్రాతిపదికను లోకానికిచ్చింది. అప్పుడు లోకంలోని అసంఖ్యాకుల కిది ప్రపంచాన్ని కబళించే పెనుభూతంలా కనిపించింది. ఏ లెనిన్‌వంటి కొద్దిమందికో ఇది కొత్తవ్యవస్థను కడుపుతో ఉన్నమాటగా సాక్షాత్కరించింది.

ఈనాడు పరిస్థితి తారుమారయింది. కమ్యూనిజాన్ని భూతంలాగ భావించేవాళ్లు ప్రపంచం మొత్తంమీద మైనారిటీ అయిపోయారు. తమ భవిష్యదాశల భూతల స్వర్గంగా భావించేవాళ్ళే ఈనాడు అధిక సంఖ్యాకులు. అభివృద్ధినిరోధకులు ఓడిపోతున్నారు. సామ్యవాదశక్తులకు పైచేయి లభించింది. ఇది ఈనాటి ప్రపంచయాథార్థ్యం.

ఇవన్నీ నేను చెబుతూఉంటే కొందరికిది విరసం రామాయణంలో రాజకీయాల పిడకలవేటలా కనబడవచ్చు. నిజమే। మనం ఇక్కడ రచయితలుగా సమావేశమైనాము. సాహిత్యపరంగా మనం చర్చించుకోవలసినవీ, పరిష్కారమార్గాలు వెతుక్కోవలసినవీ సవాలక్ష సమస్యలున్నాయి. "రచయిత అనే వాడు రాజకీయాలకి ఎంత దూరంగా ఉంటే అంతమంచిది. దైనందిన రాజకీయాల్లో కొట్టుమిట్టాడే పార్టీలున్నాయి, రాజకీయ నాయకులున్నారు. వారిని తమతమ అవసరాలను బట్టి, అవగాహనబట్టి అనుసరించే రకరకాల జనాలూ ఉన్నారు ఇదేమీ సుగంధభరితమైన వాతావరణం కూడాకాదు. రచయిత అనేవాడు ఈ కంపుకీ, రొంపికీ వీలయినంత దూరంగా వెళ్ళిపోవా" లనేవాళ్లున్నారు.

అక్కడే మామూలు రచయితకీ విప్లవ రచయితకీ ప్రధానమైన భేదం ఉంది। విప్లవ రచయిత జీవితాన్ని అన్ని దృక్కోణాలనుంచీ పరిశీలిస్తాడు. సాహిత్యాన్నీ, సకల కళలనీ, అన్నితరహాల రాజకీయాల్నీ జీవితంలో ఒక భాగంగానే పరిగణిస్తాడు, ఇలా పరిగణించడంలో తాను ఇదివరకు అలవాటుపడిన ఎన్నో అపనమ్మకాలను బుద్ధిపూర్వకంగా పరిత్యజిస్తాడు. అన్ని సమస్యలను సశాస్త్రీయమైన సహేతుకమైన పద్ధతు

లతో పరిశీలిస్తాడు. ఇలా పరిశీలించి, సరియైన అవగాహనకి వచ్చి, సుసాధ్యమైన పరిష్కారమార్గాలను ప్రవచించడానికి, ఇతనికి కొన్ని మైక్రాస్కోపులూ, టెలెస్కోపులూ, స్టెతస్కోపులూ లభించాయి వీటన్నిటికీ పర్యాయపదమైనమాట ఒకేఒకటుంది. అదే మార్క్సిజం. అదే విప్లవనౌకను విజయగమ్యానికి నడిపించే ధ్రువతార!

మార్క్సిజం అనే ఈసిద్ధాంత దర్శనానికి విప్లవ రచయితలు నిబద్ధులైఉన్నారు. వీరు కవితలు కట్టినా, కథలు చెప్పినా, నాటకాలు రాసినా, సినిమాలుతీసినా, పత్రికలు వెలువరించినా ఈ మార్క్సిస్టు నిబద్ధత ఒకటే వీళ్లని ప్రభావితంచేసి ప్రచోదిస్తుంది. మార్క్సిస్టు అవగాహన వీళ్లు జీవితాన్ని మరింత సమగ్రంగా అర్థం చేసుకోవడానికి తోడ్పడుతోంది. అందుకే వీళ్ళ రచనలు అందర్నీ, ముఖ్యంగా భవిష్యత్తుకి వారసులైన యువతరాన్ని అంతతీవ్రంగా ఆకర్షిస్తున్నాయి. విప్లవ రచనావ్యాసంగం ప్రధానంగా యువకుల ఉద్యమం. ఈ ఉద్యమకారులు వయస్సులోకన్నా మనస్సులో యువకులు. ఈ యువమనస్సులను స్పందింపజేస్తూ విప్లవరచన సాగిపోతోంది.

"ఎర్రి ట్రెయిన్ కదిలింది
ఇక దీన్నెవరూ ఆపలేరు"

అని ఫ్రెంచికవి లూయీ ఆరగాఁ సక్రియలిస్టు టెర్రరిస్టుగా ఉన్నప్పుడే రాశాడు. అందులోనే అతనింకోచోట—

"లియాన్ బ్లీంమీద తుపాకి పేల్చండి
సోషల్ డెమోక్రసీకి చెందిన సర్కస్ ఎలుగ్గొడ్లమీద
తుపాకి పేల్చండి"

అని రాశాడు. అందుకతణ్ణి అరెస్టుచెయ్యడం జరిగింది. ప్రజాభిప్రాయానికి భయపడి ఆతణ్ణి వెంటనే విడుదలచెయ్యడం కూడా జరిగింది.

మనల్నందరినీ సాహిత్యం ఇక్కడకు తీసుకొచ్చింది. ఆ సాహిత్యానికి మూల పదార్థమైన తెలుగుభాష మనల్నిక్కడకు తీసుకొచ్చింది. తెలుగుభాష అనా అన్నాను? కాదు భాషలు! తెలుగుదేశంలో రెండు తెలుగుభాష లున్నాయి. ఈ విషయాన్ని విశ్వ విద్యాలయాలు ఒప్పుకోక పోవచ్చును. సాహిత్య అకాడమీలు ఒప్పుకోకపోవచ్చును. అన్నిరకాల వాదస్థపు సంస్థలూ ఒప్పుకోక పోవచ్చును. కాని రెండు తెలుగుభాష లున్నాయనేది కాదనడానికి వీలులేని సత్యం. వీటిలో ఒకటి ఉన్నవారి తెలుగుభాష! రెండోది లేనివారి తెలుగుభాష! మొదటిది అల్పసంఖ్యాకుల భాష! రెండోది అధిక సంఖ్యాకుల భాష!

ఈ రెండుభాషలూ తెలుగుకే రెండు రూపాలని ఒప్పుకోవచ్చు. కాని కలవారి భాష ఆత్మవంచనకీ, పరవంచనకీ ఉపయోగపడుతుంది. లేనివారి భాష అకల్మషం; చిత్తశుద్ధిభరితం!

ఇందుకో చిన్న ఉదాహరణ ఇస్తాను. నేనో సినీమాపాట రాశాను. అప్పుడు నాపక్కని మరోకవి ఉన్నాడు. నాపాటని చెడపొగడేస్తున్నాడు. అద్భుతం! అద్వితీయం! ఆహా! ఓహో! అంటూ! ఇదంతా ఉత్తముఖస్తుతి అని అతనికీతెలుసు నాకూతెలుసు; నా పాటలో అంత ఆకాశానికెత్తవలసిందేదీలేదని ఇద్దరికీ తెలుసు! "Shut up, you fool!" అని గద్దించి అతణ్ణి నేనూరుకోబెట్టవలసిందే! కాని అందుకు నామధ్య తరగతి సంస్కారం అడ్డుతగిలింది.

అలాగే ఒక అలగాజనుడు పావలా టిక్కట్టు కొనుక్కొని తన అభిమాననటుడి చిత్రం చూస్తాడు. "తల్మండమొయ్య! దొంగనాకొడుకు ఎంతబాగా యాక్టుచేసిండురా!" అంటాడు. ఈభాష మనసున్నితమైన చెవులకు మోటుగా వినబడుతుంది; కాని దాని వెనుక దాగిఉన్న చిత్తశుద్ధిని శంకించనవసరం లేదు. ఈభాష నిష్కల్మషమైనదని నేనంటే అది వ్యాకరణరీత్యాకాదు. హృదయానికీ, ఊహలకీ సంబంధించిన ఒకానొక అకళంకత ఈ భాషలో ఉంది.

ఇలాంటిభాషలో సుమారు నలభైయేళ్ళకిందట నండూరి సుబ్బారావుగారు యెంకి పాటలురాశారు. అప్పుడోపెద్దగాలి దుమారం చెలరేగింది. అసభ్యశృంగారం అన్నారు. అపభ్రంశభాష అన్నారు. ఒకగొప్ప కాంగ్రెస్ నాయకుడు— పేరెందుకు చెప్పడం లెండి— ఆనాటి సుప్రసిద్ధులలో ఒకడు——

"యెంకి పాటల్లోన సంకనాకడముంది
సావసిరగడముంది సాడుకారడముంది
నాజూకులేదురా, నండూరి సుబ్బిగా!"

అని ఓచిన్న కాంగ్రెసుమార్కు తిట్టుకవిత్వం చెప్పేరు ఇంతగొప్ప సాహిత్య విమర్శతో కూడుకున్న గేయంకూడా యెంకిపాటల మహోన్నత్వాన్ని ఒక అరంగుళం కూడా కిందికి దించలేకపోయింది.

నా దృష్టిలో సభ్యమైన మాటలనీ, అసభ్యమైన మాటలనీ ఇన్నిరకాలులేవు. మానవులంతా సమానులే అని సూత్రప్రాయంగా అంగీకరిస్తే మాటలన్నీ సమానమే అని ఒప్పుకోవాలి. కాని మనుష్యుల్లో ఈనాడు ఎన్నెన్నో హెచ్చుతగ్గులు కనబడుతున్న కారణంవల్లనే భాషలోకూడా మడికట్టుకున్నభాష ఒకటీ, మైలపడ్డభాష వేరొకటి కన

బడుతున్నాయి. మన మధ్యతరగతి మర్యాదస్తుడు పెళ్ళాంమీదనో, కొడుకుమీదనో కోపంవస్తే, తాను ఏది అసభ్యం అంటాడో ఆ భాషతోనే తిట్లకు లంకించుకుంటాడు. నాయింట్లో నాలుగ్గోడల మధ్యా ఉపయోగించాను కాని సభలో కాదుకదా అని సమర్థించుకుంటాడు.

గిడుగు పండితుడు శిష్టవ్యావహారికం కోసం జీవితకాలమంతా పోరుసాగించాడు. గ్రాంథికభాష కృతకమైనదీ, పరిమిత ప్రయోజనం కలదీ అని హెచ్చరించాడు. వ్యావహారిక భాష సజీవమైనదీ, అపరిమిత ప్రయోజనమైనదీ అని ఉద్ఘోషించాడు. కొమ్ములు తిరిగిన గొప్ప పండితులకు కూడా గ్రాంథికభాష కొరకరాని కొయ్య అని వాళ్ళ గ్రంథాలలోనుంచే ఉదాహరణలు తీసుకొని నిరూపించాడు. సుప్రసిద్ధమైన వీరి "ప్రాతెనుగుగమ్మ" పాతతెలుగు ఎలావుంటుందో అందులోని తిరుగుళ్లు ఎంత క్లిష్టమైనవో చూపిస్తుంది. "ఈకమ్మలో కావాలనే నేను కొన్నితప్పు ప్రయోగాలుచేశాను. అవేమిటో చూపించగలిగితే చూపించండి" అని ఛాలెంజిచేశాడు.

గిడుగు పిడుగు ప్రారంభించిన పోరాటం ఇంకా ముగిసిపోలేదు- నిజమే, పత్రికలలో, రేడియోలలో, చలనచిత్రాలలో గిడుగువాదం జయించింది. కాని పాఠశాలల్లో, విశ్వవిద్యాలయాలలో, అకాడమీలలో ఈభాష ప్రగతి విరోధభావాలకు పట్టుగొమ్మగా నిలిచేవుంది. ఒకప్పుడు విశ్వనాథ సత్యనారాయణగారు తాము ప్రారంభించిన "జయంతి" పత్రిక మొదటి సంచికలో వ్యావహారిక భాషమాత్రమే పరిగ్రాహ్యమని సంపాదకీయం రాశారు. "కోకిలమ్మ పెళ్ళి" అనీ, "కిన్నెరసాని పాట"లనీ రాసి అదే "జయంతి"లో ప్రచురించారు. ఇవాళ కరడుగట్టిన అభివృద్ధినిరోధకుల మొదటి పంక్తిలో ఈయనగారు మనకి కనిపిస్తారు. ఔను మరి! తన అయోమయ భావాలకీ, అపభ్రంశ భాషకీ లక్షలమీద బహుమానాలు వస్తున్నప్పుడు విరసాన్ని ఈయన విరసించడంలో ఆశ్చర్యం ఏముంది? గిడుగు ప్రారంభించిన ఉద్యమానికి విశ్వనాథ చేసింది ద్రోహం! ఆ ఉద్యమాన్నింకా ముందుకు తీసుకువెళ్లడం విప్లవ రచయితల బాధ్యత! ఉండండి ఉండండి. తెలుగుదేశంలో కూడా ఒక మహోద్ధృతమైన సాంస్కృతిక విప్లవం ప్రజ్వరిల్లక తప్పదు.

మరోసారి మనం భూగోళపటాన్ని చూద్దాం. ఇందులో మనకి మూడురకాల దేశాలు కనబడతాయి. విప్లవం విజయం సాధించిన దేశాలు. (రష్యా, చీనా, తూర్పు యూరప్ దేశాలు, క్యూబా!) విప్లవం తాత్కాలిక పరాజయం పొందిన దేశాలు. (మలేసియా ఇండోనీసియా, ఫిలిప్పీన్స్, ఘనా, సూడాన్, ఫ్రాన్స్, గ్రీస్, స్పెయిన్, కొన్నిదక్షిణ అమెరికా దేశాలు.) మూడోతెగ దేశాలలో విప్లవం ఇంకా సాగుతూనే ఉంది.

ఉదాహరణకి విప్లవానికి బద్ధశత్రువైన యునైటెడ్ స్టేట్స్‌లోనే విప్లవ ఝంఝ తీవ్రాతి తీవ్రంగా వీస్తోంది. మనదేశమే మరో ఉదాహరణ. అన్ని అరబ్ రాజ్యాలలో అశాంతి జ్వాలలు చెలరేగుతున్నాయి ఈనాడు విప్లవశక్తులు దెబ్బతీసే దశకువచ్చాయి. విప్లవ నిరోధకశక్తులు దెబ్బకాచుకునే స్థితిలోపడ్డాయి. అందుకే చేగెవేరా ఇంచుమించు ఇలా అన్నాడు: "ఈ ప్రపంచమంతా ఒక చిన్నకుగ్రామం: ఇక్కడ కలవాళ్ళు చాలాకొద్ది మందే ఉన్నారు. లేనివాళ్లు కోట్లసంఖ్యలో ఉన్నారు. విప్లవానికింకా పరిస్థితులెప్పుడో పరిపక్వమవుతాయని వేచుకు కూచోనక్కరలేదు The duty of a revolutionary is to create revolution."

అందుకోసమే చేగెవేరా తన మంత్రిపదవికి రాజీనామా ఇచ్చేసి తుపాకీ భుజాన వేసుకొని విశాలవిశ్వంలోకి వెళ్ళిపోయాడు. విప్లవం ఎక్కడ చెలరేగుతూవుంటే అక్కడ తన అవసరం ఉందన్నాడు. రెండు సంవత్సరాలదాకా చేగెవేరా ఏమయాడో ఎక్కడున్నాడో ఎవరికీ తెలియదు. కాంగోలో చూశామన్నాడు. వియత్నాంకు వెళ్ళే దన్నారు. ఈలోగా క్యూబాలో జరిగిన మూడు మహాఖండాల సభకి తన శుభాకాంక్ష లను "ప్రపంచంలోని కొందొక చోటినుంచి"పంపించాడు.

ఇక్కడ నా ఉద్దేశం గెవేరా జీవిత చరిత్రను చిత్రించడం కాదు. మనబుద్ధి జీవులకు అందుబాటులో లేకున్నా, అతనిమీద చాలా పుస్తకాలు వచ్చాయి. అతడు రాసినవీ కొన్ని ఉన్నాయి. ఇరవైఒకటో శతాబ్దపు మానవుణ్ణి గురించి అతడురాశాడు. అతడే అటువంటి మానవుడా అనిపించేటట్టు బతికేడు. అర్జెంటీనాలో జన్మించాడు. క్యూబాలో విజయం సాధించాడు. బొలీవియా అడవుల్లో గెరిల్లాయుద్ధం సాగిస్తూ కాలికి గుండుదెబ్బతగిలి శత్రువుకి దొరికిపోయాడు. అతనిజేబులో ఉన్న కాగితాలనుబట్టి అతడు "దళనాయకుడు మేజర్ రామన్" అని మాత్రం శత్రువులకి తెలిసింది. గెరిల్లాల మీద కేసులుపెట్టడం, విచారణ సాగించడం ఇలాంటివన్నీ బూర్జువా పద్ధతికి విరుద్ధం. అందుచేత బూర్జువా న్యాయం ప్రకారం అతని గుండెల్లో గుండుపేల్చి చంపేశారు. తర్వాత ఇతడే గువేరా అని తెలిసింది. ఆదరాబాదరగా అతని ఫొటోగ్రాఫులుతీసుకుని అంతర్జాతీయ పత్రికలకి పంపించి శవాన్ని సక్రమంగా సమాధిచేశారు. ప్రపంచం అంతటికీ చనిపోయింది చేగువేరా అని తెలిసింది. క్యూబా నాయకుడు కాస్ట్రోకూడా గువేరా మరణించాడని హవానా నగరంలో తన ప్రజలముందు ప్రకటించాడు.

"ఒకపేరులేని సమాధిలో విశ్రాంతి తీసుకుంటున్నా, లేదా ఇంకోసారి తప్పించు కుని ఇంకోచోట ప్రత్యక్షమైనా ఈ మహాధైర్యశాలి మన ప్రశంసలకీ, గౌరవానికీ అర్హుడు" అని "న్యూయార్క్ టైమ్సు" పత్రిక సంపాదకీయంలో రాసింది.

అక్కడ బొలీవియాలో అధికారులు హడలిపోతున్నారు. బతికివున్న గెవేరాకంటె, సమాధిలోని గెవేరాశవమే వాళ్లని భయపెడుతోంది. అంచేత శవాన్ని తవ్వితీసి, చేతి బొటనవ్రేళ్లమాత్రం కోసేసి శరీరాన్ని దహనంచేసేసి, బూడిదను గాలిలోకలిపివేశారు. అంతటితో గెవేరా కథముగిసిందని వాళ్ళనుకున్నారు. కాని ఆక్షణంనుంచే అతని కథ ప్రారంభమయింది.

అమెరికన్ నీగ్రో నాయకుడు స్టోక్లీకార్మైకేల్ ఇలా అన్నాడు: "చేగెవేరాను నేనెప్పుడూ వ్యక్తిగతంగా కలుసుకోలేదు. కాని నేనతణ్ని ఎరుగుదును. ఇప్పుడు ఇంకా బాగా ఎరుగుదును. ముఖ్యమైన విషయం ఏమిటంటే అతని భావాలన్నీ మనతోనే ఉన్నాయి. అందుచేతనే మనం నిర్విరామంగా పోరాటంసాగించడానికి సిద్ధంగా ఉన్నాం" అని. అందుకే చేగెవేరా చనిపోయాడని తానంగీకరించలేనన్నాడు.

చేగెవేరా అవలంబించిన పోరాటపద్ధతులను గర్హిస్తున్నవారు సహా అతడాశించిన సమాజాన్ని ఆహ్వానిస్తూనే ఉన్నారు. అతడు సమాజంలో సమూలమైన మార్పులు కోరాడు. అందుకు మానవస్వభావంలో సంపూర్ణమైన పరివర్తన జరగాలన్నాడు.

గెవేరా రచించిన "క్యూబాలో మానవుడూ, సామ్యవాదమూ" అనే గ్రంథం నుంచి ఈ దిగువ నాలుగు ముక్కలూ ఉదహరించి, ఇంతటితో గెవేరా ప్రసక్తి ముగిస్తాను.

మనం సృష్టించవలసింది 21వ శతాబ్దపు మానవుణ్ని. అయితే ఇంకా ఇది ఊహిస్తున్న చిత్రమేగాని సాధించిన ఆశయంకాదు. ఒకొక్కడూ ఎన్ని కిలోగ్రాముల మాంసం తింటున్నాడు. ఏడాదికెన్నిమార్లు సముద్రతీరాల్లో విలాసయాత్రలు చేస్తున్నాడు. లేదా ఇప్పుడున్న జీతంతో ఎన్నిరకాల దిగుమతి సరుకులు కొనుక్కోగలుగుతున్నాడు అన్నదికాదు ప్రశ్న. వ్యక్తికి మరింత ఎక్కువ సంతృప్తికలిగిందా లేదా? తనలోని అంతస్సంపద ఇంకా అధికమయినట్లు భావిస్తున్నాడా లేదా? ఇంకా ఇంకా ఎన్నెన్నో బాధ్యతలు ఎక్కువవుతున్నట్టు గ్రహిస్తున్నాడా లేదా?" అని ఆ గ్రంథంలో అడుగుతున్నాడు చేగెవేరా.

అటువంటి మనిషినీ, అటువంటి సమాజాన్నీ నిర్మించడానికి తమ కలాన్ని ఒక పదునైన ఆయుధంగా ఉపయోగించడంకన్నా విప్లవ రచయితలకు వేరే కర్తవ్యం ఏముంటుంది? ఇందుకోసం మనం జీవితవ్యాసంగాలన్నింటిలోనూ, ముఖ్యంగా సృజనాత్మక కార్యక్రమాలన్నింటిలోనూ అధికాధికంగా పాల్గొనాలి. పాల్గొనడం మాత్రమేకాదు. సాంస్కృతిక, వైజ్ఞానిక, సాహిత్యాదులైన అన్ని వ్యాపకాలలో ముందు పీటీని నిలిచి నాయకత్వం వహించి నడిపించాలి.

ఇంతవరకు కవిత్వంలోనూ, కథానికల్లోనూ వి.ర.సం. సభ్యులదే నాయకత్వం. బూర్జువా పత్రికలకు రాసే యువకులుకూడా వి.ర.సం. భావాలతో ప్రభావితులవుతు న్నారు. వీళ్ళకిమనం అన్నివిధాలా ప్రోత్సాహం ఇవ్వాలి. పాపం, వీళ్లకింకా వాస్తవికతను గురించిన అవగాహన చాలదు. కలంపట్టిన మర్నాడే వీళ్లొక మాయకోవస్కీ అయి పోవాలనిగానీ మాక్సింగోర్కీ అయిపోవాలనిగానీ మనం ఆశించడం లేదు. అలాగ వాళ్ళని తయారుచేసే మాజిక్ చిట్కాలేవీ మనదగ్గరలేవు. కాని మనం ప్రచురిస్తున్న పత్రికలన్నీ (ఇవి ప్రస్తుతం అత్యల్పసంఖ్యలోనే ఉన్నాయనుకోండి) దేశం నలుమూలలా వ్యాపించే విధంగా చూడాలి. అడ్డుపడే సైంధవులు అడుగడుగునా ఉంటూనే ఉంటారు. నాకు పోస్టులోరావలసిన ఎన్నో ఉత్తరాలూ, పత్రికలూ మాయమైపోతున్నాయి. దీనికి కారణం ఏమనిచెప్పుకోవాలి. ఆభగవంతుడి అనేకలీలలలో ఇదీ ఒక చీపురుకట్టసరసం అని సర్దిపెట్టుకోవాలి.

ఇంకోరకం దాడి ఉంది. కిందటి సంవత్సరం మనం "ఝంఝ" అనే కవితా సంకలనాన్ని ప్రచురించాం. రెండు నెలలు తిరక్కుండానే శ్రీమదాంధ్రమహా గవర్న మెంటువారు మన గ్రంథాన్ని ఏవో కుంటిసాకులు చూపించి నిషేధించారు. కాని ఈలోగా మన "ఝంఝ" రెండు ముద్రణలయి, రెండువేలకాపీలు అమ్ముడుపోయింది. మద్రాసులో మరో వెయ్యి కాపీలు ముద్రిస్తే అవి ఒకటి రెండు వారాల్లోనే చెల్లుబడి అయిపోతాయి.

మన వి. ర. సం. సభ్యులకి కవితాగానం గురించీ, కథారచన గురించీ ఇక్కడ నేను ఎక్కువగా చెప్పవలసిందిలేదు. నవలారచన మాత్రం చాలా బలహీనంగా ఉందని చెప్పాలి. అందుకు తగినంత తీరుబాటులేకపోవడం ఒకకారణం కావచ్చు. కథానిక ఒక Snap-shot లాంటిదనీ, నవల ఒక కుడ్యచిత్రం లాంటిదనీ ఒకసారి నేను నిర్వచిం చాను. మన ఇరుగుపొరుగు భాషలతోపోల్చి చూసుకుంటే నవలల విషయంలో మనం వెనకబడి ఉన్నామనే చెప్పకతప్పదు. కవితల, కథానికల రచనలో అంతర్జాతీయ స్థాయి నందుకున్న తెలుగువాళ్లు నవలల దగ్గరికి వచ్చేసరికి దేశీయస్థాయినికూడా చేరుకోలేక పోవడమనేది ఆశ్చర్యకరమే.

నాటకాలలో కూడా కన్యాశుల్కం తర్వాత అంతగొప్ప నాటకం మళ్ళీరాలేదు. అభ్యుదయ రచయితల సంఘంతో సన్నిహితంగా సహకరిస్తూ ప్రజా నాట్యమండలి అనేసంస్థ పనిచెయ్యడంవల్ల మాభూమి, ముందడుగులాంటి మంచినాటకాలు వచ్చాయి. అవి మంచినాటకా లనడంకన్నా, వాటివెనుక స్వర్గీయ గరికపాటి రాజారావు ప్రతిభ వాటికి రంగస్థలంమీద ప్రాణప్రతిష్ఠ చేసిందని నేను భావిస్తున్నాను. ఏది ఎలావున్నా,

ఈనాడు మన విప్లవ రచయితల సంఘంతోకలిసి పనిచేసే ప్రజానాట్య సంఘం ఒకటి చాలా అవసరం. దేశంలో ఔత్సాహిక నాటకసంఘాలు అనేకం ఉన్నాయి. ఏటేటా ఎన్నెన్నో నాటకపోటీ ప్రదర్శనలుకూడా జరుగుతున్నాయి. కాని ఇవన్నీ ఇప్పటి పెట్టుబడిదారీ వ్యవస్థకుమాత్రమే పరిమితమై పనిచేస్తున్నాయి. ఇష్టమున్నా లేకున్నా ఈవ్యవస్థ విధించే షరతులను శిరసావహించి మాత్రమే ప్రదర్శనలు జరుపుకుంటు న్నాయి. అలాకాకుండా మనమొక విప్లవ నాటకరంగ వేదికను నిర్మించాలి. ధనస్వామ్య వ్యవస్థకంటె సామ్యవాద వ్యవస్థ ఎన్నోరెట్లు మెరుగని ఆచరణలో నిరూపించాలి.

అలాగే మనం ఒక సినిమా తియ్యాలనుకున్నా మనుకోండి. మనల్ని మొట్ట మొదట ఎదుర్కొనే ప్రశ్న— అమ్మయ్యో, అంతడబ్బు మనకెక్కడనుంచి వస్తుందని. ఒక నాటకం అచ్చువెయ్యడానికి నూరు రూపాయలయితే, దాన్ని ప్రదర్శించడానికి వెయ్యి రూపాయలైతే, దాన్ని ఫిలిం తియ్యడానికి లక్షరూపాయలవుతుంది. విప్లవచిత్రం మీద లక్షరూపాయలు మదుపుపెట్టడానికి ఎంత వెర్రివాడయినా ముందుకురాడు సత్య జిత్‌రాయ్ తన మొదటిచిత్రం "పథేర్ పాంచాలీ" లక్షరూపాయలు ముందుగా బ్యాంకులో వేసి తర్వాత ప్రారంభించలేదు. అంతర్జాతీయ విఖ్యాతి నార్జించిన ఆ చిత్రం మొట్ట మొదట అతని మనస్సులో ఒక ఊహగా మాత్రమే ప్రారంభమయింది. ఆ ఊహకి కూడా రెండో ప్రపంచ యుద్ధకాలంలోనూ ఆ తర్వాతనూ నిర్మితమైన ఇటాలియన్ ఫిలింలు Rome open city, Bicycle Thieves, మొదలైనవి ఉద్దీపన కలిగించాయి

మొదటి ప్రపంచయుద్ధం ముగిసిన తర్వాత పుడోవ్‌కిన్, ఐసెన్‌స్టైన్ మొదలైన రష్యన్ డైరెక్టర్ల చలన చిత్రాలు ప్రపంచమంతటా పెద్ద సంచలనం కలిగించాయి. అప్పుడు మనది బానిసదేశం కాబట్టి వాటిని నేను చూడడం సాధ్యపడలేదు. అయినా వాటిని గురించి చదువుతూ ఉంటేనే నా ఒళ్లు జలదరించేది. అలాగే పైనపేర్కొన్న ఇటాలియన్ చిత్రాలను అవి తయారయిన కొద్దికాలంలో మద్రాసులో జరిగిన ఫిలిం ఫెస్టివల్‌లో చూడగలిగాను. చూడడమేకాక వాటినిగురించి ఇంకా ఎక్కువ తెలుసుకో డానికి Italian Cinema అనే పుస్తకం కొని చదివాను. నాటినుంచి నేటిదాకా ఫిలిం తియ్యడానికి డబ్బుకాదు ప్రధానం అనే దృఢనిశ్చయం నాలోకలిగింది. మద్రాసులో కొందరు అరవ ఆఫీసుకుర్రాళ్లూ, ప్రొడక్షన్ మానేజర్లూ ఈపెట్టుబడిదారీ పరిధిలోనే చిల్లిగవ్వయినా చేతిలోలేకుండా ప్రారంభించి ప్రొడ్యూసర్లయారు. రచయితలు తమ కలంబలంతో ప్రొడ్యూసర్లూ, డైరెక్టర్లూ మాత్రమేకాక స్టూడియో అధిపతులు కూడా అయారు

Rome open City అనే చిత్రం మరియామిబీ అనే అమ్మాయి ఇంట్లో ప్రారంభమయింది. జర్మన్ ఆక్రమణలో ఉన్న రోమునగరంలో ఈ అమ్మాయి ఇల్లు

అజ్ఞాత జీవితంలో ఉన్న ప్రతిఘటన వీరులకు పోస్టాఫీసుగానూ, తాత్కాలికంగా తల దాచుకునే చోటుగానూ ఉపయోగపడేది. ఇక్కడ కొందరు సినీమా టెక్నీషియన్ల చర్చల ఫలితంగా ఈచిత్రం రూపుదాల్చింది. డైరెక్టర్ రోసోలినీ, కెమెరామన్ ఉబాల్డో అరాటా, చిత్రంలో ప్రతిఘటన వీరుడి ప్రియురాలుగ నటించిన మరియామిచీ వీళ్లంతా చర్చలు సాగించి "ఇప్పుడు మనం రోమ్‌నగరంలో గడుపుతున్న జీవితాన్నే చిత్రంగా తీద్దాం" అనే నిర్ణయానికివచ్చారు. (ఇటీవల సత్యజిత్‌రాయ్ తీసిన "ప్రతిద్వంది" అనే చిత్రానికి ఈనాటి కలకత్తా నగరమే కథావస్తువు !) Rome open City లో ఆనాడు వాళ్ళెదుర్కొన్న ప్రమాదాలున్నాయి వీరోచితమైన సాహసం ఉంది, బీభత్సం ఉంది, హాస్యం ఉంది. అన్నింటికన్నా, కష్టకాలంలో మనిషిని మనిషి ఎలాగ ఆదుకునేదీ చూపించే మానవత్వం ఉంది.

చిత్రం ఏమిటంటే ఇటాలియన్ ఫిలింలు ఇటాలియన్ జీవితాన్నీ రష్యన్ ఫిలింలు రష్యన్ జీవితాన్నీ, బెంగాలీ, మళయాళీ, తమిళ ఫిలింలు బెంగాలీ, కేరళ, తమిళ జీవితాల్నీ ప్రతిఫలిస్తూంటే తెలుగు ఫిలింలు తెలుగు జీవితం జోలికిపోవు. లాభసాటిదృష్టితో అంధానుకరణంచేసే పెట్టుబడిదారీ మనస్తత్వమే దీనికి కారణం. ఈ మనస్తత్వాన్ని ఎదిరించి నిలబడగలననీ, ఈనాటి తెలుగు జీవితాన్ని ఎటువంటి పుక్కిటి పురాణాలూ, ఎటువంటి అభూత కల్పనలూ జోడించకుండా, ప్రతిబింబించగల ఫిలిం తీయించగలననీ నాకు గట్టిధైర్యం ఉంది.

అయితే తెలుగు జీవితపు బహుముఖఫలకాలను చిత్రించే నవల ఏదీకనిపించదే! అమ్మాయి అబ్బాయిని చూశాడు. ఇద్దరూ ప్రేమించుకున్నారు. కాని కులంలోనో ధనంలోనో తేడాలువచ్చి పెళ్ళిమాత్రం జరగలేదు. నిజమైన ప్రేమికులు కాబట్టి ఆత్మ హత్య చేసుకున్నారు. నిజమైన సినీమాకథ విషాదాంతం కాకూడదు కాబట్టి స్వర్గంలో కలుసుకున్నారు.

ఈకథ ఏవూళ్ళో జరిగిందో తెలియదు, ఏ సంవత్సరంలో ఎన్నినెలల్లోజరిగిందో తెలియదు. ఏపాత్రకీ పేరేతప్ప ఇంటిపేర్లుండవు వాస్తవికతగురించి మన రచయితల అవగాహన ఇంత వైభవంగా ఉంటుంది. జేమ్సుజాయిస్ అనే నవలా రచయిత లియోపోల్డ్‌బూమ్ అనే ఒక సామాన్య మానవుడు ఒక సామాన్యనగరంలో 24 గంటల సామాన్య జీవితాన్ని గడపిన కథని వెయ్యిపేజీల నవలగా రాశాడు. మన మహాభారతంలో 18 పర్వాలలాగ అందులో 18 ఘట్టాలుంటాయి. హోమర్ రచించిన ODYSSEY లోలాగ? నవలకు జాయిస్ పెట్టినపేరు Ulysses. కాని ఈ యూలిసిస్ అనేపేరు మొత్తం వెయ్యిపేజీల్లోనూ ఎక్కడా కనబడదు ప్రతీ మానవుడి జీవితమూ

ఒక మహాభారతమే అని నిరూపించడమే జేమ్స్‌జాయిస్ ఉద్దేశం. ఇందులో ఎంత సూక్ష్మాతిసూక్ష్మ వివరాన్నీ అతను వదలిపెట్టలేదు దీన్ని పూర్తిచెయ్యడానికిక తనికి ఏడేళ్లు పట్టింది. ఇందులో అశ్లీలాలూ బూతులూ ఉన్నాయని అమెరికన్ ప్రభుత్వం దీన్ని నిషేధించింది. ప్రథమ ముద్రణ ప్రతులన్నింటినీ తగలబెట్టించింది. ఆ బూతులనుమాత్రం తొలగించి కొందరు అమెరికన్ ప్రచురణకర్తలు ఆ గ్రంథాన్ని ముద్రించి అమ్ముకొని సొమ్ముచేసుకున్నారు. రచయితకు సెంటుకూడా ముట్టజెప్పలేదు. ఈదుర న్యాయాన్ని ఖండిస్తూ యూరప్‌లోని వందమంది మేధావులు సంతకంచేసిన నిరసన పత్రం ఈనాడు చరిత్ర ప్రసిద్ధమయింది అమెరికన్ సుప్రీంకోర్టువారు ఈగ్రంథంలో అశ్లీలం అనేదిలేదని తీర్పుఇచ్చారు అనాడు నిషేధించబడిన Ulysses నవల ఈనాడు అమెరికన్ యూనివర్సిటీలలో పాఠ్యగ్రంథమయింది.

తెలుగుతనం ఉట్టిపడే నవలను తీసుకుని తెలుగు జీవితానికి ప్రతిబింబమయిన సినీమా తియ్యడం అలా ఉండనిద్దాం. "వి.ర సం." తరపున ఒక అధికారపత్రికను నిర్వహించగల స్థితిలో మనం ఉన్నామా? ఇక్కడకూడా మనల్ని ఎదుర్కొనేది డబ్బు సమస్యే. మన గొంతుకలు వినబడనివ్వకుండా మనచుటూ ఎన్ని బూర్జువా పత్రికలు రణగొణధ్వనులు చేస్తున్నాయో అదీ మనకు తెలిసినసంగతే. పెద్దపెద్దరోటరీ యంత్రాలనే ఉత్పత్తిసాధనాలను తమ ధనబలంతో కొనుక్కొని వచ్చి ప్రజల హృదయాలనీ, అభిరుచుల్నీ ఈ పెద్ద పత్రికలు కలుషితం చెయ్యగలుగుతున్నాయంటే మరి వీటి దుష్ప్రాభవాన్ని ఎదుర్కోవడం ఎలాగ! ఏ దినపత్రికనైనా చూడండి. అందులో వ్యాపార ప్రకటన లెక్కువా, రీడింగ్‌మేటరు తక్కువా! ఒక పౌరహక్కుల రక్షణ సభలో మాట్లాడుతూ, ఒక్క వ్యాపార ప్రకటనకూడా స్వీకరించకుండా నాలుగుపేజీల దినపత్రికను నడిపించే స్కీముని వివరించాను. ఇదేమీ అసాధ్యమైన పనికాదు. మన దృష్టిని గ్రామాలమీదకీ గ్రామీణ ప్రజలమీదకీ మరలించాలి. వాళ్ళ కళారూపాలలో మన విప్లవ వస్తువుని దట్టించి వాళ్ళకి అందజెయ్యాలి. ఇది వాళ్ళభాషలోనే అందజెయ్యాలి. నిరక్షరాస్యత పూర్తిగా నిర్మూలించబడ్డ తర్వాత గిడుగువారు ఆశించిన శిష్ట వ్యావహారికం దానంతట అదే ఏర్పడుతుంది. అయితే తాబేలునడక నడుస్తున్న మన విద్యావిధానంలో ఇదెన్నాళ్ళకు సాధ్యమవుతుందో యేమో! ఈలోగా మనం జానపద రూపాలను ఇతోధికంగా అధ్యయనం చెయ్యాలి. సొంటిపిక్క పెట్టి గుంట ఓనమాలు దిద్దించే విద్యాబోధన పద్ధతులు సమూలంగా మార్పించడానికి మనం ఆలజడిచెయ్యాలి.

ఈ ప్రసంగం ప్రారంభంలో చేగెవేరా అనే విప్లవకారుణ్ని సంస్మరించాను. ఇకదీన్ని ముగించే ముందు విప్లవకారులని కేసు బనాయించి అన్యాయంగా మరణశిక్ష

విధించబడిన ఇద్దరు ఇటాలియన్ అమెరికన్లను గురించి కొద్దిగా ముచ్చటిస్తాను. వీళ్ళపేర్లు సక్కో, వంజెట్టీ. స్వదేశంలో పొట్టగడవక అమెరికాకు వలసవచ్చినవాళ్లు. వీరిలో ఒకడు చెప్పులు కుట్టుకునేవాడు. ఇంకొకడు చేపలమ్ముకునేవాడు. వీళ్ళని అమెరికన్ ధర్మశాస్త్రం అక్రమంగా హత్యచేసింది, మరణదండన అనేపేరుతో.

ఎలెక్ట్రిక్ కుర్చీమీద కూర్చునేముందు వంజెట్టీ తన వచ్చీరాని ఇంగ్లీషులో ఇలా అన్నాడు: If it had not been for these thing. Imight have live out my life talking at street. Corners to scorning men. Imiget have die, unmarked, unknown, A failure. Now we are not a failure. This is our corner and our triumph. Never in our full life could we hope to do such work for tobrance, for jowstee, for man's understanding of man his now we do by recident. Our wards-our lives- our pains- nothing! The taking of our lives-lives of a good shoe-maker and a poor fiol peddla- all. That last moment belongs to us- that reony is our triunph."

వంజెట్టీ చనిపోయాడు. అతనిమాటలకి మరణంలేదు. ఇంక్విలాబ్ జిందాబాద్.

---

వచ్చే సంచికలో—

| | | |
|---|---|---|
| మనోజ్ఞే | పాట | జన సేన |
| జానపద కవిత్వం | వ్యాసం | కలసాని ప్రసాద్ |
| భావస్వాతంత్ర్యం— | | |
| ఎందుకు, ఎక్కడ, ఎంతవరకు? | ఆలోచన | కె. వి. రమణారెడ్డి |
| హక్కు | కథ | మరువాడ రాజేశ్వరరావు |
| సమీక్షలు | | |
| సాంకేతిక పదకోశం | | కొడవటిగంటి కుటుంబరావు |
| దేవాలయాలమీద బూతుబొమ్మ లెందుకు? | | డాక్టర్ ఎస్. వి. ఎస్. రావు |
| ఏకపద్యోపాఖ్యానము | | 'పేర్వారం' |
| కళారంగం: | | |
| తెలుగు సినిమా | | శ్రీశ్రీ |

---

రచయిత- కమిట్‌మెంట్ పై
ఝాఁ పాల్ సార్త్రి అభిప్రాయాలు.

ఆధునిక సాహిత్య చరిత్ర : 3

# భావ కవిత్వం

అద్దేపల్లి రామమోహనరావు

ఇరవైయవ శతాబ్దానికి ముందు సాహిత్యం ప్రజలకి అందని ఆకాశాల్లో ఉంది. చెప్పేవర్గం ఒకటి, వినేవర్గం ఒకటి అనే సిద్ధాంతానికి స్పష్టమైన రూపకల్పనగా ఆ సాహిత్యం సర్వాత్మనా వృద్ధిపొందింది. సమాజంలోని ఉన్నతవర్గాలకే అంకితమై పోయింది. అటువంటి సాహిత్యం భావకవితాయుగంలో ఆకాశంనించి దిగివచ్చి స్వప్న రూపం ధరించింది. అభ్యుదయ యుగానికిగాని, అది వాస్తవంకాలేదు. ఒకవిధంగా ప్రబంధ సాహిత్యం ఉన్నతవర్గ సాహిత్యం. భావకవిత్వం మధ్యతరగతి సాహిత్యం. అభ్యుదయ సాహిత్యం సామాన్యుడి సాహిత్యం. మధ్యతరగతి జీవితానికి క్రియా సాహసం తక్కువ. కలలుగనడం ఎక్కువ. ఇట్లా కలలుగనడమే భావకవిత్వపు ప్రధానలక్షణమైంది. కందుకూరి, గురజాడ, చూపించిన సామాజికమార్గానికి భావ కవులు మనసు మళ్ళించలేదు. ప్రపంచం ఎట్లాపోయినా, మనసులేని మధురోహలకి రూపకల్పన చెయ్యడమే వారికి లక్ష్యమైంది.

అప్పటికింకా రాజకీయార్థికావగాహనమీద వ్యవస్థని తీర్చిదిద్దాలనే ఆలోచనకి ప్రాబల్యంలేదు. దేశానికి స్వాతంత్ర్యం రాగానే సంపూర్ణ నూతన సౌఖ్యమయ జీవితం వస్తుందని ప్రతి భారతీయుడూ కలలుగన్నాడు. ఎం.ఎన్.రాయ్ లాంటి మేధావులు స్వాతంత్ర్యంతో ఏమీ ఒరగబోదనీ, ఇంగ్లీషువాడి దోపిడీపోయి, మనను మనమే ఇంకా స్వతంత్రంగా దోచుకోడమే సంభవిస్తుందనీ గట్టిగా వాదించారు. (ఈనాడు ఈ మాటలు ఎంత నిజమైనవో అందరికీ తెలిసింది). కాని అది అరణ్యరోదనే అయింది. దేశానికి స్వాతంత్ర్యం రావడమే లక్ష్యమనీ, దానికి ప్రాణాలర్పించినా ముక్తికలుగు తుందనీ ప్రతి ఒక్కడూ నమ్మాడు. గాంధీగారి పిలుపుకి ప్రతిరాయీ ప్రతిధ్వనించిన రోజులవి. అందువల్ల స్వాతంత్ర్యమే, సంపూర్ణ స్వాతంత్ర్యభావమే ప్రతివ్యక్తి నరనరాల్నీ ఊపేసినకాలం అది. ప్రతిశాస్త్రంలోనూ స్వతంత్రమైన భావానికి ప్రాధాన్యం కలిగింది. వేదాంతం, కళలు, సౌందర్యం, నీతి, పాండిత్యం— సర్వవిషయాల్లో ప్రాచీన సంప్రదాయానికి అంధానుకరణంగాక నూతన వ్యాఖ్యానాలు ప్రారంభమైనై.

అందుకే స్వాతంత్ర్యోద్యమ సమయం విజ్ఞానప్రాభవానికి స్వర్ణయుగంగా నిలబడి పోయింది. మొత్తంమీద సర్వరంగాల్లోనూ నూతనోత్తేజంతో తరంగితమైన భావం. స్వాతంత్ర్యం. స్వేచ్ఛ. ఈనాడు విప్లవకవి గుండెలు "విప్లవం", విప్లవం"– అని కొట్టుకున్నట్లు. ఆనాడు భావకవి గుండెలు "స్వేచ్ఛ. స్వేచ్ఛ" అని కొట్టుకుని ఉంటై. దేశ వాతావరణంతో, సమాజ జీవనంతో, రాజకీయభావాలతో, ప్రత్యక్ష స్పందన కాకుండా, వాటి సారభూతమైన ఒకేఒకభావంతో జ్వలించడం, భావకవిత్వపు లక్షణం. ఆ సారభూతమైన స్వేచ్ఛాభావంనుండే సర్వకవిత్వమూ వికసించింది.

ఫ్రెంచి విప్లవకాలపు స్వేచ్ఛాభావంతో ఉత్తేజితులై, ఆంగ్ల కవిత్వానికి మధుర స్వప్నయుగాన్ని సృష్టించిన Romantic Poets లో వీళ్ళుకోరిన సంపూర్ణ స్వేచ్ఛావిష్కృతి కనబడింది. సంస్కృతంతోపాటు ఆంగ్లాన్ని బాగా చదివిన ఈ భావకవులు, తమకు వందఏళ్ళ పూర్వపు రొమాంటిసిజాన్ని ఆదర్శంగా స్వీకరించి, అందులోనుండి ప్రాణాన్ని పంచుకున్నారు. రొమాంటిక్ కవుల్లో, కేవలం మధురప్రేమ, సుకుమార భావన, శైలీసౌందర్యం మొదలైన లక్షణాలు మాత్రమేకాకుండా, అద్భుతమైన విమర్శనశక్తి, విపరీతమైన హేతువాదమూ, సామాజిక రాజకీయ భావావిష్కృతి కూడా కనిపిస్తై. కాని, మన భావకవులు అవి ఏవీ గ్రహించలేదు. కేవలమూ స్వప్నానికి అనుబంధమైన భావాల్నిమాత్రమే గ్రహించారు.

ఒకవంక స్వాతంత్ర్యోద్యమ ఝంఝ అతితీవ్రంగా వీస్తున్నా, ఉద్యమంలో తలమునకలుగా దిగి, ఆ భావాలతో గుండెలు మండిపోతున్నా, కవులు, ప్రేయసీ భావనాసౌధంలోనే తలదాచుకుని, చల్లదనాన్ని వెతుక్కున్నారు. ఉదాహరణకి కొడాలి రాసిన "జైలులో చందమామ" చూడవచ్చును. జైలులో ఉన్నా ప్రేయసికి సందేశమే పంపాడు కవి. దీన్నిబట్టి తెలిసేదేమంటే, మన నిత్యజీవితం, చుట్టూఉన్న సమాజం వేరు, మనం రాయవలసిన కవిత్వం వేరు– అనేభావం యింకా సాహిత్యంలో వదిలిపోలేదు. కవులకింకా సామాజిక భావాలు రూపొందించడంపై మనస్సుపోలేదు.

ఆనాటికి భారతదేశంలో రవీంద్రనాథ ఠాకూరు తన మహాప్రభావాన్ని యింద్రజాలంలా వ్యాపింపజేస్తూ ఉన్నాడు. ఒక ఆధ్యాత్మికమైన వేదననీ, మానసికమైన స్వేచ్ఛనీ, అపూర్వమైన సంగీతాన్నీ ప్రతిగుండెకీ పంచుతున్నాడు. ఆ రొమాంటిక్ కవులూ, ఈ రవీంద్ర కవీంద్రుడూ, భావకవితాయుగానికి మూలస్తంభాగా నిలిచారు.

వ్యక్తిస్వేచ్ఛ. వ్యక్తులకి అనుభూతి స్వేచ్ఛ, ఆ అనుభూతిని తనయిష్టం వచ్చినట్లు కవిత్వంలో వెలువరించే స్వేచ్ఛ— యివీ భావకవిత్వపు మూలసామగ్రి. ఇరవైయవ శతాబ్దపు ముందున్న సాహిత్యం వ్యక్తిదికాదు, ప్రభువుది. ఆ రాజరికపు

అనుభూతి హక్కు మీద సవాల్. స్వేచ్ఛాభావుకుడైన భావకవి రచన— ఈ స్వేచ్ఛా భావానికి రూపకల్పన కృష్ణశాస్త్రిలో పరాకాష్ఠకుపోయి కనిపిస్తుంది—

రాజవీధుల రతనాల రథమునెక్కి
వెడలు పాషాణ నిర్జీవ విగ్రహంబ !
ఏను స్వేచ్ఛాకుమారుడ ; ఏననంత
గగన పథవిహార విహంగమ పతినినేను—

కృష్ణశాస్త్రి చేసిన స్వేచ్ఛాగానమంతా యీ అనుభూతి హక్కు కోసం వ్యక్తి హృదయం చేసే మహాగర్జన. "Man is born free but he is every where in chains" అన్నరూసో మాటలతత్వం ఈ స్వేచ్ఛాగానం వెనుక ఉంది.

జాతి మత కుల పదవీభేదం వదిలిపెట్టి, సర్వజనులకు సమాన సౌందర్యానుభూతి కావాలి— అనే భావానికి దువ్వూరి రామిరెడ్డి రూపకల్పన చేస్తాడు "భవిష్య ద్దర్శనం" లో—

సకల మానవజాతి సంతతులు కుల
వర్ణ భేదంబుల పాటింపబోక
యొక్క కడుపున బుట్టి, ఒకచన్నుపాలు
త్రావినరీతి, సౌందర్యంబు కలిగి
అన్యోన్య సాహాయ్య మర్థించువారు—

మనస్సు విపరీతమైన స్వేచ్ఛాభావంతో రెక్కలు కొట్టుకుంటున్నప్పుడు, కట్టలు తెంచుకున్న అహంభావంతో స్పందిస్తున్నప్పుడు, సామాజిక స్పృహ లేని సమయంలో, వెంటనే ముందుకొచ్చేది శృంగారభావమే. శృంగారం, ఆత్మాశ్రయత్వానికి అతిదగ్గరి బంధువు. అందుకని భావకవులందరికీ శృంగారమే ఆరాధ్యదైవమైంది. పైగా రొమాంటిసిజమ్, రీజన్ మీద ఇమోషన్ పొందిన విజయం అని ఆంగ్లవిమర్శలో ఒక సిద్ధాంతం ఉంది. మన సంఘానికి 20వ శతాబ్దందాకా కట్టుబాటు అతితీవ్రంగా ఉన్నది. అప్పుడప్పుడే హేతువాదం, సంఘ సంస్కారవాదం ప్రవేశించి, కట్టుబాట్ల పునాదులు కదిలించడానికి ప్రయత్నిస్తున్నై. అందువల్ల భావకవుల మనస్సు ఉద్రేకాలమీద అతితీవ్రమైన స్వాతంత్ర్యాన్ని భావించింది. అణిచిపెట్టబడిన ఉద్రేకాలన్నిటికీ outlet గా కవిత్వం మారిపోయింది. అంతక్రితం ఉన్న ప్రబంధకవిత్వం శృంగారమంటే కేవలం శారీరకమైన కామమే అన్నభావాన్ని వ్యాప్తిచేసింది. దీనికి కారణమేమిటంటే, ఆ కవిత్వం రాసిన కవులకిగాని దాన్నిపోషించిన రాజులకిగాని స్త్రీ శరీరాలకి లోటు లేదు. కామానుభవానికి హద్దులేదు. ఆ స్థితిలో మనస్సును, అనుభూతిని గూర్చి

పట్టించుకునే ఆవశ్యకతలేదు. వాళ్లకి మోహమన్నాగూడా ఒంటిమీద విజృంభించే జ్వరమే తప్ప, హృదయంలో చెలరేగే తాపానుకాదు. ఎప్పుడు కవిత్వం రాజుల పోషణని వదిలిపెట్టి, ప్రజల్లోకిరావడం మొదలైందో, అప్పుడు ప్రజల మనోభావాల్ని ప్రతిబింబించవలసి వచ్చింది. ప్రజలస్థితి ఎప్పుడూ శృంగారవిషయికంగా తీరనికోరికలతో, అందరాని ప్రేమలతో అలమటిస్తూ ఉంటుంది. అందువల్లే ఈ మానసికభావాల్ని ప్రతిబింబించడం భావకవిత్వపు ప్రధానలక్షణమైంది. కవులలోగూడా ఎవరు మానసిక వేదనాలక్షణం గలవాడో, ఎవరు శృంగార విషయికంగా విరహరహస్యం తెలిసినవాడో, అతని కవిత్వానికే విలువ వచ్చింది. ఏకాలంలోనైనా పాఠకహృదయాన్ని ప్రతిబింబించడమే కవిత్వ ప్రధానగుణం. ఆకాలంలో ఇంకా సామాజిక పరిజ్ఞానం సమాజంలో తీవ్రంగా వ్యాపించలేదు. కవిత్వాన్ని పోషించే సహృదయుల మనస్సులు ప్రబంధాలతో విసుగెత్తి, కొత్తకవిత్వానికి అలమటిస్తున్నై. అందువల్ల ఒక్కసారి భావకవిత్వం, సహృదయ భావప్రతిధ్వనిగా నిలిచింది. ప్రేమనుగూర్చిన దృక్పథం ప్రేయసిమీదనే గూడుకట్టుకుపోయింది. అంతకుముందు యుగాన్ని మలుపుతిప్పిన గురజాడకూడా ప్రేమవాదియే.

"దేశమనియెడి దొడ్డవృక్షం
ప్రేమయను పూలెత్తవలెనోయ్"

అన్నప్పుడుగాని,

"మరులు ప్రేమని మదిదలంచకు
మరులు మరలును వయసుతోడనే
మాయ మర్మములేని నేస్తము
మగువలకు మగవారి కొక్కటె
బ్రతుకు సుఖముకు రాజమార్గము—
ప్రేమనిచ్చిన ప్రేమ వచ్చును
ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును"—

అన్నప్పుడుగాని, గురజాడకి శృంగారాతీతమైన హృదయ సహజలక్షణమైన ప్రేమమీదనే గురి. ఈ ప్రేమనే ఆయన తన కవిత్వంలో, కథల్లో, వ్యాసాల్లో చాలా చోట్ల ప్రబోధిస్తాడు. ఈ గురజాడ పై గేయం చేత ప్రభావితమైన బసవరాజు గేయం చూడండి—

"వలపెరుంగక బ్రతికి
కులికి మురిసేకంటె
వలచి విఫలమ్మొంది
విలపింప మేలురా!

చెలివలపు లేని నీ
కలిమికాల్పనె। వినుము
వలపుతీగనే జీవ
ఫలము కాయునురా।

బసవరాజు బోధించే ప్రేమతత్త్వం ప్రేయసిచుట్టూ అల్లుకున్నతీగ. ఇదే భావ కవులందరి ప్రేమకూ మూలతత్వం.

ఏకాలంలోని భావసంచలనమైనా కవుల్లో ఉద్రేకరూపాన సాక్షాత్కరిస్తుంది. కథా నవలా రచయితల్లో సూక్ష్మాంశసహితమై విశ్వరూపంతో కనిపిస్తుంది. భావ కవిత్వపు యుగంలోని శృంగార భావనకీ, స్వేచ్ఛాపరాకాష్ఠకీ, వైయక్తిక సంస్కృతి వికాసానికీ, అన్వేషణ పరత్వానికీ, పోటెత్తిన సముద్రం లాంటివాడు "చలం". భావ కవితాయుగం యొక్క సారభూతమైనభావాలు చలంలో హేతువాదపూర్వకంగా దర్శన మిస్తై. అతడు ప్రధానంగా వ్యక్తివికాసవాది. "నాకు సంఘ సంస్కరణాభిలాష చాలా తక్కువ. మనుషులు (ముఖ్యం నేను) వ్యక్తిగతంగా ఉన్నతులుకావాలనే నాదేవులాట" (సృజన, 7. పేజి 1 ).

చలం విషయం ఎందుకుచెప్తున్నానంటే భావ కవితాయుగం యొక్క హృదయం ఆత్మాశ్రయంచుట్టూ స్పందిస్తోందన్న రహస్యాన్ని వివరించడానికి.

భావకవితా శృంగారంలో ముఖ్యంగా మూడంశాలు కనిపిస్తై. (i) శరీర సౌందర్యం (ii) మానసిక అనుభూతి (iii) అందని దానికోసం తపన (ఇదే దైవాన్వేషణగూడా అయింది. ఒకవిధమైన పరిభాషలో జీవునివేదన.)

భావకవితా యుగంలోనే చారిత్రిక దృష్టి బాగా ఏర్పడింది. కవిత్వం బాగా అర్థం కావాలంటె, ఆ కవికాలమూ, వ్యక్తిత్వమూ, అకాలంలో వ్యాప్తియైన భావాలూ, వీటన్నిటి ప్రమేయమూ అవసరమనే భావం వ్యాప్తిపొందింది. అరవిందఘోష్ ఈ దృష్టిని ఖండిస్తాడు. కవిత్వాన్ని మెచ్చడానికి యివన్నీ అనావశ్యకమనీ, కవిత్వాన్ని కవిత్వంగానే చూడాలనీ అంటాడు. కాని యీదృష్టి తొలిసారిగా భావకవితాయుగంలో తొలగిపోయింది. తెలుగుభాషలో విమర్శని మొట్టమొదటిసారిగా మలుపుతిప్పిన కట్టమంచి రామలింగారెడ్డి "కవిత్వ తత్వవిచారం" యిందుకు ఉదాహరణ. సామాజిక భావాల సహాయంతోనే కవిత్వాన్ని పూర్తిగా అర్థం చేసుకోగలమనే భావాన్ని ఆయన మొదటిసారి తీవ్రంగా ప్రవేశపెట్టాడు. భావకవిత్వపు పూర్వవిమర్శ అంతా శిల్ప పరిధానమూ, రసవిధేయమూ. భావకవిత్వం ఈ బంధాల్నిదాటి భావపరిధానంగా

రూపొందింది. అభ్యుదయయుగంలో సామాజిక రాజకీయ వస్తుప్రధాన రచనాపద్ధతికి ముందు జరిగిన యీమార్పు గుర్తించదగింది.

కవిత్వానికి ఉన్నతమైనభాష కావాలి— అనే దృక్పథానికిగూడా మొదటిసారి దెబ్బకొట్టింది భావకవిత్వమే. సమాసబహుళమైన జటిలరచనకీ, గుండెకి ఎదురుదెబ్బ కొట్టి రసాన్నిసాధిస్తాననే కఠినపద ప్రయోగానికి, భావకవిత్వం విడాకులిచ్చింది. పైగా తెలుగు నుడికారంలోని సౌందర్యాన్నీ లలితమైన సుబోధకమైన సంస్కృత పదాలశోభనీ, పూర్తిగా వినియోగించుకోవడానికి భావకవిత్వమే మొదటిది. గ్రాంథిక భాషనీ. ఛందస్సునీ, కల్పననీ బాగా ఆదరించినప్పటికీ, మొత్తంమీద భాషావిషయి కంగా పెద్దమెట్టునించి కవిత్వాన్ని దించేసింది భావకవిత. అందుకే జానపదభాషలో మొదటిసారిగా అత్యున్నతభావాల్ని స్పందింపజేసిన ఎంకిపాటలకి, విపరీతమైన గౌరవం కలిగింది. భాషాదృష్టిలో వచ్చిన ఆధునికమైన మార్పుకి యిది దర్పణం లాంటిది.

మరొక మార్పేమిటంటే, మేధస్సునుండి దిగి కవిత్వం హృదయాన్నాశ్రయిం చడం, అంతకుముందు కవిత్వాన్ని వినేవాళ్లు కొందరూ, అర్థంచేసుకునేవాళ్లు కొందరూ ఉండేవాళ్లు. వినేవాళ్లు పదాల్నీ, శైలినీ, భావాన్నీ మెచ్చుకునేవాళ్ళు. అర్థం చేసుకునే వాళ్లు భాష, వ్యాకరణం, అలంకార శాస్త్రం, మిగిలినశాస్త్రాలు, అన్నీ సమన్వయించి, కవిత్వాన్ని అర్థంచేసుకునేవాళ్లు. కవిత్వం ఆస్వాదించేవాళ్ళలో ఉన్న ఈభేదం భావ కవిత్వంతో సమసిపోయింది. కవిత్వం మేధస్సుయొక్క కుస్తీపట్లను తప్పించుకున్నది ఈయుగంలో. అభ్యుదయ యుగంలో ప్రజాకవిత వ్యాపించడానికి ముందుమెట్టిది.

ఇంకొక ముఖ్యమైన విశేషం, కవిత్వం కేవలం అనుభూతి ప్రధానమైనది అనే భావం వ్యాపించడం. కవిత్వం చదవగానే హృదయంమీదపడ్డ ముద్రయే సహృదయుని ఆస్తి. "కదిలేదీ కదిలించేదీ" మాత్రమే కవిత్వం. ఇది అభ్యుయయుగంలో ఇంకొక అడుగుముందుకువేసి ''మారేదీ మార్పించేదీ'' అనే ప్రయోజనాన్ని జోడించుకుంది. మొత్తంమీద జనంలో ఎక్కువమందికి మనం చెప్పేది అర్థంకావాలి అనేస్పృహ; అనూచానంగావస్తున్న మేధాగతమైన శిల్పం అనబడే "లాగుట, పీకుట" అనే వాటికి విడాకులు; సూటిగా పాఠకుని హృదయంలో కలిగే భావస్పందననే కవితా పరమార్థంగా గుర్తించడం— ఈమూడు మహావిషయాల్లో భావకవిత్వం, అభ్యుదయ యుగంలో సంపూర్ణత సాధించిన మార్గానికి తిరిగిన మలుపుగా ఉంది.

మరొక్క విషయం గూడా ముఖ్యంగా చెప్పాలి. 20 వ శతాబ్దికి ముందు ఛందస్సు చెరసాల. గణ యతిప్రాసల నియమాలమధ్య భావం గిలగిలాకొట్టుకుంది.

అభ్యుదయ యుగంలో మొదలై, అంతకంతకీ ఎదిగి, విప్లవయుగంలో పరిపూర్ణత సాధించిన వచనగేయం, సర్వఛందో నియమాల్నించీ భావాల్ని వెలికిలాగి రక్షించిన పరిణామం. ఛందస్సు యొక్క ఈ రెండుదశలకీ నడమనున్నది భావకవిత్వం. ఛందస్సు పలచబడిపోయినదశ అది. పద్యరచన స్వీకరించినా, గీతపద్యమూ, సీసమూ ఎక్కువ ప్రచారాన్ని పొందినై. ఈరెండు పద్యాలకీ నియమాలు తక్కువ. పైగా శబ్ద సౌందర్యసాధనలో యివి చాలా ఉపకరిస్తై. ఈ పద్యాలుగాక గేయాలు రాయడమన్నది ఛందః ప్రస్థానంలో ఒక ముఖ్యాంశం. ఈ విషయంలో మాత్రం గురజాడ అప్పారావు పరిణయకవుల కారాధ్యుడైనాడు. ప్రసిద్ధుడైన ప్రతిభావకవీ, చివరకు విశ్వనాథ సత్య నారాయణ గూడా ముత్యాల సరాల ఛందస్సులో, గేయాలురాశారు. ఇటువంటి లయ బద్ధమైన గేయాలేగాక, భావం ఎట్లాసాగితే అట్లా గేయాలురాసిన వాళ్లున్నారు. ఇందులో కవికొండల చెప్పుకోదగ్గవాడు.

"శివరాత్రి ప్రభ"లో—

మోకరింపులుగావు
అది మఱి
బూకరింపుల నిలువుగాదు:
ఆ కడకుబడు నొక్క అంజ
ఈ కడకుబడు నొక్క అంజ
ఏకముగ జేయుచును
నడుమొక
లేఖగాఁ దావంచికొంచు
సందియం లేకెంచు వారెవరు—
చిందు అనితోతెంచు వారెవరు—
కారు నల్లని కాళరాత్రి—"

కవికొండల, బసవరాజు, రామిరెడ్డి, బాపిరాజు, అబ్బూరి— మొదలైన వాళ్లంతా ఛందస్సులో ఇట్లాంటి ప్రయోగాలు చేశారు. అంటే ఛందస్సులో ఉండే నియమాన్ని ఛేదించే భావానికి ప్రాధాన్యం కట్టబెట్టేమార్గంలో యిది ప్రధానమైన మలుపు. ఇటువంటి భావకవుల లయగంధి స్వతంత్ర గేయాలనుండి, శ్రీశ్రీ లయగంధి వచనాలనుండి, ఆయనలోనే లయనుగూడా వదిలించుకున్న వచనగేయాల నుండి, శబ్దానుప్రాసలు, మిగిలిన తర్వాత కవుల రచనలనుండి, ఏమాత్రమూ శబ్దానుప్రాసలూ మొదలైన కృత్రిమాలు లేకుండా, కేవలం భావాన్ని శిరసావహిస్తూ ప్రవహించిపోయే ఈనాటి వచనగేయం పరిణమించింది.

మొత్తంమీద కవిత్వంలో రాదగిన సామాజిక ప్రయోజన పరిణామాన్నిపూర్తిగా వికసింపజేసిన అభ్యుదయ యుగానికి ముందు, భావకవిత్వం దానికి కావలసిన కొన్ని స్పందనల్ని బాగా వ్యాపింపజేసింది. భావకవితా వ్యతిరేకంగా అభ్యుదయ కవిత బయలుదేరినా (ఏకాలంలోనైనా కొత్త ఉద్యమంతనకు ముందున్న ఉద్యమాన్ని వ్యతిరేకించే బయలుదేరుతుంది) అనేక విషయాల్లో అభ్యుదయ యుగపరిణామంతో భావ కవితకుగల చారిత్రిక ప్రాధాన్యాన్ని గుర్తించవలసిందే.

భావకవిత్వపు తొలిరోజులనుండీ ఈనాటిదాకా ఒకేవిధమైన శిల్పంతో, ఒకే విధమైన గ్రాంధికంతో రచనచేస్తున్నవాడు విశ్వనాథ సత్యనారాయణ. ఆయన మొదట్లో తీవ్రమైన భావకవ్వింతో ప్రారంభించినవాడే. అనార్కలి, కిన్నెరసాని, ఏకవీర, ప్రేమగీతాలు మొదలైనవన్నీ యిందుకు నిదర్శనాలు. తీవ్రమైన శృంగారమూ, దాన్ని మించినకరుణా, అంతకుమించిన ఆచరణరహితమైన ఆధ్యాత్మికభావనా, హేతువాద విరుద్ధమైన వైదికాలోచనా— ఆయన రచనా ప్రణాళికకు వెన్నెముక. మాటాలు— నవలలో, తేలికైన వ్యావహారికంతో, కరుణరసంతో పఠితల హృదయాల్ని దోచిన విశ్వనాథ. వేయిపడగలతో వేయి సంవత్సరాల వెనక్కివెళ్ళిపోయాడు. రామాయణ రచనతో యింకా వెనక్కి వెళ్ళిపోయాడు. ప్రాచీనకవుల శిల్పరీతులన్నీ తనలో ఉన్నయ్యని, ఆయనా, ఆయన శిష్యులూ చెప్తూ ఉంటారు. నిజమే, అద్భుతమైన మేధాశక్తి ఆయనకున్నమాట యథార్థమే. కాని, ఎంతశక్తిగల ఔషధమైనా, దాని కేమాత్రమూ సంబంధంలేని రోగంమీద ఉపయోగిస్తే, నిష్ఫలమైపోతుంది; రోగాన్ని పెంచుతుంది; ప్రాణాల్నేముంచుతుంది. అట్లాగే మారేకాలానికి పనికిరాని వస్తుశిల్పాల్లో పరాకాష్ఠనొందిన విశ్వనాథ, సమష్టిమీద, ఈకాలానికి పనికిరానికవి ఐనాడు. అభ్యుదయ యుగంలోకూడా కొంతమందికి ఆధునిక భావాలమీద ఉద్రేకంతోపాటు, ప్రాచీనభావాల మీద ప్రీతి ఉండటం జరిగింది. అందువల్ల భావకవులందరూ, అభ్యుదయకవుల్లో కొందరూ, విశ్వనాథని శిరసావహిస్తూనే వచ్చారు. కాని, కాలం బాగామారిపోయింది. సంపూర్ణ విప్లవభావాలు బాగా ప్రచారం పొందుతున్నై. తీవ్రమైన, స్పష్టమైనవర్గాలుగా సాహిత్యం విభజితమౌతోంది. వర్గసామరస్యంస్థానే, వర్గపోరాటానికి జాగాస్థానం ఏర్పడుతోంది. అందువల్ల విశ్వనాథగానీ, ఆభావాల్ని యింకా ప్రచారంచేసే సాహిత్యం గానీ, కొద్దివర్గానికీ, గ్రంథాలయాలకీ పరిమితమైపోతోంది. ఈవిధంగా, ఎంత ప్రతిభ ఉన్నా సమాజలక్షణానికి సరిపడకపోతే, వృథా ఔతుందన్న సత్యం ఈనాడు బాగా ఋజువౌతోంది. త్రికాలాబాధిత సాహితీశిల్పానికి నిలకడకి తావులేకుండా పోతోంది. సమాజంతో సాహిత్యం మారాలి, ఏనాటి సంఘాన్ని మంచిదారిలో నడిపించేది, అనాటి

సాహిత్యం అన్నది స్థిరమౌతోంది. మరోకాలంలో దానిబలం తగ్గినాసరే, ఎవరూ చదవకపోయినాసరే, ఆకాలంలో దానిప్రయోజనం నెరవేరినట్లే— అనే భావానికి ప్రాబల్యం కలుగుతోంది

మొత్తంమీద భావకవిత్వం అంతకుముందు పద్ధతులమీద ఎగరేసిన స్వతంత్రి జండా ఐనా, ఆపద్ధతులమీద గౌరవంమాత్రం పోలేదు విశ్వనాథని శిరసావహించని భావకవిలేదు. సౌందరనందాది ఉత్తమశిల్ప నిర్మితాలైన కావ్యాలకి పలుకుబడితగ్గలేదు. కథాత్మక కావ్యాలు మన్నింపబడుతూనే ఉన్నై. సంప్రదాయంమీద పూర్తిగా ద్వేషం కలగలేదు. దీనికికారణం అప్పటికి కా సామాజిక రాజకీయార్థిక అవగాహన బాగా వ్యాపించకపోవడమే. ఈమార్పు అభ్యుదయోద్యమం నిర్వహించింది. రాజకీయ సామాజికావగాహనతో, తెలుగు సాహిత్యంలో సంపూర్ణమైన మలుపుగా అవతరించిన అభ్యుదయ కవిత్వాన్ని పరిశీలించవలసి ఉంది.

---

రాచకొండ విశ్వనాథశాస్త్రి చెప్పిన చెఖోవ్ కథ :

## ఇన్‌దిగలీ

దిక్కూ మొక్కూలేని ఓ పేదపిల్లని ఓ పోలీసువాడు పెళ్ళాడతాడు. వాళ్ళకు ఓ కొడుకుపుడతాడు. ఈలోపున ఓ దొంగనాణాల కేసులో ఆపోలీసు వాడికి శిక్షపడగా అతడు సైబేరియాలో కలిసిపోతాడు. అప్పుడా పేదపిల్ల తన కొడుకుని పెట్టుకుని అత్తమామల పంచన వూడిగంచేస్తూ వుంటుండగా, పెద్దాని కొడుక్కి ఆస్తి పంచవలసివస్తుందికదా అనే కోపం పెట్టుకుని ఆమె తోటికోడలు ఆమె లేతకొడుకుమీద వుడుకునీళ్ళు కుమ్మరించేస్తుంది. ఉడికిపోయిన కొడుకుని భుజానవేసుకుని కొన్నిమైళ్ళు నడుచుకుని ఆ పేతల్లి ఆస్పత్రికి వెళ్ళేసరికి సాయంకాలం అవుతుంది. అక్కడ డాక్టరు ఆ పిల్లాణ్ణి తణిఖీచేసి ఆమెతో, "అమ్మా, నీకొడుకు చచ్చిపోయాడమ్మా" అని చెప్తాడు. అస్తమించబోయే సూర్యకిరణాల్లో ఆస్పత్రి అద్దాలు భగభగ మండుతున్నట్టుంటాయి. ఆ మంటల్లోంచి ఆ పేతల్లి ఆ లేతశవాన్ని భుజానవేసుకుని వచ్చి నాటురోడు చేరుకునేసరికి కారుచీకట్లు ఫులుముకుంటాయి. అప్పుడు, ఆమె వూరివైపే వెళ్ళే ఓ ముసలి బండివాడు ఆమె సంగతి తెలుసుకుని ఆమెను తనబండి ఎక్కమని చెప్పి, ఆమెకి తన అనుభవాల సారాంశం ఏమిటో తెలియజేస్తాడు.

ఆ బండివాడు చాలా రాజ్యాలు వెళ్లేట్ట, చాలా జీవితం చూసేట్ట, ఎక్కడచూసినా చెడ్డే చెలామణీ అవుతూందట, ఎక్కడకెళ్ళినా పాపమే తెగ పెరుగుతోందట. అయితే యింత ఘోరపాప పంకిలంలో ఇంతమంది జనం యింకా యీమేరకైనా బతగ్గలిగే వున్నారంటే యీ లోకంలో "మంచి" అనేది ఎక్కడో అక్కడ ఎంతో కొంతవుండే వుండాలట. ఆ మంచితనం వుంటుందనే నమ్మివుండాలనే ఆశించి మనం బతకాలట. (ఆపేతల్లి, ఆఖరికి, తన తోటికోడలు కట్టే ఇటికల(?) ఫ్యాక్టరీలో కూలిమనిషిగాచేరి తనకష్టాల్ని పాటలుగా కూర్చుకుని కాలం వెళ్ళబుచ్చుతుంది)

[చెఖోవ్ చెప్పిన బండివాడు చెప్పిన బతుకుమాటలు నన్నెందుకోగాని బాగా ఆకర్షిస్తాయి. శ్రీకాకుళపట్నం రామారావుగార్ని చూసినప్పుడల్లా ఆ మాటలే నాకు గుర్తుకొస్తాయి—అంటారు రావిశాస్త్రిగారు]

కాళీపట్నం రామారావుగారి కథల సమీక్ష :

# యజ్ఞం కథలు - కథారచనలో కొత్త ప్రమాణాలు

యజ్ఞం కథ చదువుతున్నప్పుడు ఒక కోర్టులో ఉన్నట్టుంటుంది. సామాజిక న్యాయంమీద దృష్టినంతటినీ కేంద్రీకరించారు రచయిత. సామాజిక పరిస్థితులను చారిత్రక ఆధారాలతో రాసిన కథలు తెలుగు సాహిత్యంలో లేవు అని చెప్పుకోదగ్గంత తక్కువ. చరిత్రనీ కథనీ కలిపి చెప్పటానికి అసాధారణ పరిణతి రచయితకి అవసరం. ఆ ప్రతిభ రామారావుగారిలో కన్పిస్తుంది. అయితే ఈ కథలో రచయిత మానవత్వపు విలువల సంబంధాల సంస్పందనకు ప్రాధాన్యత యిచ్చినట్టు కనిపించదు. కథ బుద్ధి మీదచూపిన ప్రభావం ఎక్కువ. అనుభూతికి అందదు. చివరికి సీతారాముడు తన కొడుకును చంపుకున్న దగ్గరకూడా చాల బలమైన ఈ హ్యూమన్ టచ్‌ని విచికిత్సలో విడిచిపెట్టారు.

సీతారావు్ఁడు అఁటాడు :

"నానెంతసెప్పినా నీకళ్ళపొర తెగనేదు. నయాన సెప్పినాను. నిన్ను సంపుతా నన్నాను. నన్ను నరుక్కు సస్తానన్నాను. అయినా నువు నామాటిన్నావ్‌కావ్.

ఎందుసేత ?

నీకు జనం మెప్పుకావాల. అప్పల్రాఁవుడు శానమంచోడు. ఆడితప్పనోడన్న మాటకావాల. అమాయికుడన్న పేరుకావాల. నీబిడ్డ పాపలెలాగటపోనీ. నీకు డంబం అంత యేటట ? దరమం తప్పరు. కల్ని ఎవడుసెప్పిన దరమం ? ఏటా దరమం ?

ఓఁయ్యా నువు నీబిడ్డలకేం సేస్తన్నావో, నీ కుటుంబానికేటైఁది నీ కంటిగ్గాని, జనం కంటిగ్గాని ఎంతసెప్పినా కాపడ్డంనేదు. ఏరికంటిక్కనపడకండ నువ్వేం సేస్త న్నావో ఆదేపని అందరికంటిక్కనపడేట్టు నానూసేసేను— సూసుకో".

ఈ తర్కంకంటె కొడుకుతో సీతారాముడుకున్న అనుబంధాన్నిచెప్తే స్పష్టంగా పాఠకుని అనుభూతికి చేరేది కథలో నాటకీయశిల్పం గీసిన హద్దువల్ల ఈ లోపం ఏర్పడింది.

రావిశాస్త్రిగారి ఇంట్రోలో చెప్పిన చెహోవ్‌కథ 'ఇన్‌దిగలీ' లో దిక్కూమొక్కూ లేని ఆపేతల్లి జీవితాన్ని నెరేట్‌చేసి రచయిత సాధించిన ప్రయోజనం గొప్పది. ఉడికి పోయిన లేతకొడుకును భుజానవేసుకుని ఆపేతల్లి మైళ్లనడిచి డాక్టరుదగ్గరకు పోవడం, డాక్టరు 'అమ్మా, నీకొడుకు చచ్చిపోయాడమ్మా' అని చెప్తే ఆతల్లి అలేతశవాన్ని మోసుకుని కారుచీకట్లలో రావటం— ఇదీకథలో హ్యూమన్‌టచ్. ఈ అంశం యజ్ఞంలో లోపించింది. జీవితంనించి ఉత్పన్నమైన సంఘర్షణ భాగం మాత్రమే మనకి రచయిత

చెప్పారు. జీవితాన్ని ఆ సంఘర్షణలోంచి చూడాలి. జీవితం అన్న ఆలంబన కళలన్నిటికీ చాల ముఖ్యం.

కాళీపట్నం రామారావుగారు ఈ యజ్ఞం కథకి ముందు సుమారు పదేళ్ళు కథా రచన మానుకున్నారు. '55 వరకు వారి అచ్చయిన కథలు తొమ్మిదిమాత్రమే. సగటున సంవత్సరానికి ఒకకథ రాసినట్టు ఇప్పుడింక నయం. సంవత్సరానికి రెండుమూడు వరకు వస్తున్నాయి. 'కీర్తికాముడు' 'జయప్రద జీవనం'. '49 లో ఆంధ్రపత్రిక వీక్లీలో వచ్చాయి. 'పెంపకపు మమకారం', 'రాగమయి' '49, 50 భారతిలోవచ్చాయి. 'అభిమానాలు', 'పలాయితుడు' 'అభిశప్తులు' ఆంధ్రపత్రిక ఉగాది సంచికల్లో '52, '53, '54 లలో వచ్చాయి. '55 భారతిలో 'అశిక్ష—అవిద్య' వచ్చింది. తర్వాత '64 వరకు ఆయన కథలు రాయలేదు.

కథలు రాయటం మానేసిన కాలంలో ఆయనజీవితాన్ని ఆబ్జెక్టివ్‌గా చూసారు. ఈలోగా రావిశాస్త్రిగారి ప్రభావం పడింది. వారి ఆలోచనాధార ఆకర్షించింది. దాని ఫలితమే 64 మేలో పూర్తిచేసిన 'యజ్ఞం'.

రామారావుగారు యజ్ఞంని మొదట్లో నవలగా రాయాలనుకున్నారు. రచయితల ఇబ్బందులవలన ఓపిక తగ్గిపోయి ప్రక్రియలు మారిపోతాయి. యజ్ఞం కథగా మారింది. కథకున్నపరిధి చాల పరిమితం. జీవితాన్ని వడపోసి సంఘర్షణ భాగాన్ని మాత్రమే తీసుకున్నారు. దాంతో జీవితం అంతా ఫేడౌట్ అయింది. దాంతో కథంతా ఒకరంగానికి పరిమితమైపోయింది. కథాగమనంపై నాటకీయశిల్పం దాడిచేసింది. ఈ అంశంమూలం గానే తండ్రీ కొడుకుల అనురాగాలనిగాని, ఆత్మీయతలనిగాని ధ్వనింపచేయటానికి సరయిన ఆధారం దొరకలేదు. న్యాయమండపం మీద పాత్రలన్నీపోగయి కథని నడపటం, ఒకేసమయంలో కథను ముగించటం జరిగింది. ఈశిల్పం కథాప్రక్రియకున్న విస్తృత అవకాశాన్ని సంకుచితం చేసింది.

కథని మొదటి వాక్యంతో ఆరంభించారు. కాని తర్వాత మూడుపేజీలు సుందర పాలెం టొపొగ్రఫీనీ, చరిత్రనీ, అక్కడి పరిస్థితులనీ పరిచయం చేసారు. రామారావుగారి కథల్లో సాఫీగా చదివించే గుణంలేదు. ఇది ఆయన కథల్లో సామాన్యమైన బలహీనత. ఈ కథకి సంబంధించినంతవరకు ఈ మూడుపేజీల పరిచయం ఒకకారణం అనిపిస్తుంది. ఈ పరిచయాన్ని ఒకేదగ్గర ఇవ్వటంకన్నా అక్కడా అక్కడా సంద ర్భోచితంగా కథంతా పరిచేయటం మంచిది.

సొంతముద్ర ఉన్న నిండుతనం, పరిణత ఉన్నశైలి రామారావుగారిది. అయితే అక్కడా అక్కడా కొంత డిస్టర్బెన్స్ ఉంది. ఉదాహరణకి— "సొమ్ము మందలకు పోయేవేళ. అంటే తెలియదు. పదిగంటల వేళ" ఈధోరణి వారిశైలిలో ఇమడదు.

"ఆ సన్నని ఇరుకువీధుల్లో నెత్తిన నిలువెత్తు గడ్డిమోపులతో—" అని రాసిన పేరాగ్రాఫు వాక్యాన్ని ఎక్కడికక్కడ తెంచేయటం మంచిది. ఆవాక్యం గజిబిజిగా

మారింది. పల్లెల్లోని గజిబిజి జీవితాన్ని ఆ శైలితో చూపిస్తానన్న వాదనతో నేను ఏకీభవించను. మొత్తం కథాగమనాన్ని ఇలాంటి ప్రయోగాలు కొంతవరకు దెబ్బతీసాయి.

ముగింపులో రచయిత చాల మెలికలు తిప్పారు.

తమ్మారుక్కు పెట్టె అందుకుని షరాణీపత్రంమీద వేలిముద్ర వేయడం దగ్గర వరకు కథాగమనం ఒకపద్ధతిలో ఉంది. తర్వాతనించి సీతారాముడు పారిపోవడం, నాయుళ్లు చేపాటి కర్రలతో పోట్లాటకి నిలబడడం, గాంధీజీ స్వరంతో శ్రీరాములు నాయుడు 'నామాటవిని మీరెవ్వరూ తొందరపడకండి' అని చెప్పడం, సీతారాముడు మాలపేటనించి ఖజాన గోనెమూటలతో రావటం (మాలపేటనించి వచ్చిన దూరంలో తప్పనిసరిగా సీతారాముని శరీరం రక్తం మచ్చలతో నిండిపోవాల్సిందే.) సీతారాముడు తండ్రిని నిందించటం కన్నబిడ్డని చంపేసిన వైనం చెప్పటం, చివరికి శ్రీరాములు నాయుడు మీదికి, ఆ తర్వాత మునసబు బాబుమీదికి....

ముగింపులో రచయిత ఏ అంశంమీద ఫోకస్‌చేసారు అన్నది స్పష్టంగాలేదు. దోపిడీశక్తుల న్యాయంమీదికా? దోపిడీకి బలవుతున్న పరిజల నికృష్టతమీదికా. గొలుసుగా ఉన్న చాలా విషయాలని చెప్పటంవలన దేనిమీదా రచయిత కేంద్రీకరించక పోవటంవలన ముగింపు బలంగారాలేదు.

రెండోకథ తీర్పు. అది ఈ కథల సంపుటిలో యజ్ఞం, ఆర్తిలమధ్య ఇమడదు. చాల సాధారణమైన రచయిత రాసేకథ స్థాయిలో ఉంది.

మూడోకథ ఆర్తి.

మాలపల్లెలోని కడుపునిండని మనుషుల కానిబుద్ధుల కథ ఆర్తి.

పైడయ్య పాతికేళ్ళవాడు. పట్నంలో కళాసీ. పెళ్ళం సన్నెమ్మకోసం పల్లె వచ్చాడు. కాని తల్లీ అత్తలమధ్య తగువు, పంతాలు, పట్టింపులు. కోడల్ని తీసుకురానని కూర్చుంది తల్లిబంగారి. అంతేకాదు కండీషన్లు పెట్టింది. రెండేళ్ళో మూడేళ్ళో తన మనసుకునచ్చి తను అవునన్నదాక పుట్టింటి గడపతొక్కనని మాటియ్యాలి కోడలు. సన్నెమ్మతల్లి, ఎర్రెమ్మ, వచ్చి తనవల్ల పొరపాటయ్యిందని లెంపలేసుకోవాలి. అత్తగా బంగారి కిర్రపట్టు పట్టింది.

తగువంతా ఎక్కడొచ్చిందంటే ఎర్రెమ్మ కూతుర్ని పండక్కి తీసుకుపోవడం దగ్గర. ఎర్రెమ్మమొగుడు అవిటోడు. కూతురుకు పెళ్ళిచేసిం తర్వాత ఎర్రెమ్మబతుకు కష్టమయింది. చిన్నకూతురున్నదంటే దానిసాయం ఏముంటుంది? కూలీనాలీ సంపాదించే సన్నెమ్మ పరాయి ఇంటికి వెళ్ళిపోయింది. ఒక్క ఎర్రెమ్మ తెచ్చింది ఇంటిల సరిపోదు. పండగపేరుతో కూతుర్ని తెచ్చుకుని పండగరోజుల్లో పరికోతల కూళ్ల సంపాదించుకోవాలన్నది ఎర్రెమ్మ ఆలోచన. ఈకరువురోజుల్లో కోడల్నివదులుకోలేదు బంగారి దానికీ అదే ఆలోచన. పండగ మర్నాడు తీసుకువెళ్ళమంది. బంగారి ఇంట నలుగురు మగకూలీలు. సన్నెమ్మకాక ఇంకా ఇద్దరు ఆడకూలీలు ఉన్నారు. కోడలు

తనహక్కు అన్నది బంగారి వాదన. దాన్ని పనులకాలంలో పుట్టింటికి పంపించేసి నష్టపోయే తెలివితక్కువది కాదు బంగారి.

ఎర్రెమ్మ వాదనేమిటంటే— పైడయ్య, అల్లుడు, పట్నంల ఉన్నాడు. నా కూతుర్ని దీని కొడుకుతో మనువడాని కంపినానా దీనింటికాకిరి కిచ్చినానా ?' అని. ఎర్రెమ్మ వాదనకి అవునన్నవాళ్లున్నారు.

చివరికి ఆ ఇద్దరు యీరవురాళ్లమధ్య కయ్యం జుట్లుపట్టుకున్నదాకా వచ్చింది. రక్తాలు కారుతున్న తల్లితో సన్నెమ్మ పుట్టింటికి వెళ్ళిపోయింది అప్పుడు.

అత్త బంగారి 'ఇదుగో, యిప్పుడు దానెంట యెల్లినావో, మరీగడపల అడుగెట్టవ్' అని తెగేసిచెప్పింది అత్త.

మూడేళ్ళు గడిచిపోయాయి.

పట్నంనించి పైడయ్య వచ్చాడనితెలిసి పండక్కి పిలవడానికొచ్చింది ఎర్రెమ్మ భోగిపండగ రేపనగా, తల్లిమాటకి ఎదురుచెప్పలేడు పైడయ్య.

ఇదే అదననుకుని బంగారి దెప్పాల్సినవన్నీ దెప్పింది. 'ఆనాడేవఁని కూసినా ; నానూ నాకొడుకూ ముమ్మారు నీయింటిచుట్టూ తిరిగి నీకడియాల కాలకి మొక్కిందాకా నువుగాని నీకూతురుగాని నాగుమ్మం తొక్కరన్నావా ? మరిప్పుడు ఏ మొహఁవెట్టుకొచ్చినా ? ముందు నువ్వొచ్చినావా, మాఁవొచ్చినాఁవా, సిగ్గుబొగ్గులేసికొని నువ్వే మా గడపలడుగెట్టినావు ....'

'అయితే కొడుక్కీ కోడలకీ యిడబాపు లెడతావేటే' అని ఎర్రెమ్మ ఎత్తింది. కూతుర్ని తీసుకెళ్లిననాడు ఆపని ఎర్రెమ్మే చేసిందని బంగారి ఉద్దేశం.

కొడుకు బంగారి పంపించలేదు. తిట్లుతో, శాపనార్థాలతో ఎర్రెమ్మ ఎళ్లిపోయింది.

ఆ సాయింత్రం సన్నెమ్మ గరికేళ్లు తవ్వుతుంటే తుమ్మల్చెరువు కళింగడా గట్టున పైడయ్య పెళ్లాన్ని కలిసాడు. తగువేమిటో పెళ్ళంనోట విందామనుకున్నాడు. అటు కనుకున్న తల్లిమీదగాని, ఇటు కడుపులోదాచుకునే అత్తమీదగాని నేరం మోపి చెప్పలేకపోయింది. మొగునితో మాటాడమే చాతకాలేదు. గంప ఎత్తుకుని లేచిపోయింది. తనుకూచున్నా సన్నెమ్మ పోవడం పైడయ్యని బాధకలిగించింది. మావింటికి తవిటప్పగారింటికి ఓపాలి రమ్మన్నాడు.

ఆ తవిటప్ప ఇల్లు అడ్డమైనోళ్ళూదూరే గుడిసె. అక్కడికి వెళ్లనంది సన్నెమ్మ. తమ ఇంటికే రమ్మంది పైడయ్యని. తల్లి ఆంక్షలకు ఎదురుతిరిగి అత్తవారింటికి వెళ్ళలేకపోయాడు పైడయ్య.

రెండోరోజు భోగినాడు పండగచేదు మింగి మైలున్నరదూరంలో ఉన్న పెద్దమ్మ ఇంటికివెళ్లాడు పైడయ్య. అక్కడ జారికి రామయ్య కోడలుమీద మనసుపడింది. ఆ

వేడిలో, వచ్చినప్పుడు దార్లో గంగమ్మ గుడిసెదగ్గర ఆగాడు. ఆడమనిషి సుఖం వాడికక్కా వాలి గంగమ్మ తాగబెట్టింది. తాగాతాగిన పైడయ్య వాంతి చేసుకున్నాడు. మత్తులో ఆ వమనంలో పడ్డాడు.

ఇది దొరికింది ఎఱ్రెమ్మ తగువుకి రెండోరోజు వచ్చి బంగారిమీద పడింది. 'జానె! రాత్తిరి నీకొడుకు నెక్కడి కంపించావే? రాత్తిరి నీకొడుకుని నీ సిన్నకొడుకు నీపెద్దకొడుకు మోసుకొచ్చినారు ఎక్కణ్ణించి మోసుకొచ్చినారు?' తో ఆరంభమయి మొత్తం తనదుఃఖాన్నీ కోపాన్నీ బాధనీ అవమానాలనీ అన్నిట్నీ కడిగేసుకుంది. బంగారిని, బంగారి కొడుకుల్నీ, వాళ్లపరువునీ తీసేసింది.

బంగారి చిన్నకొడుకు కోటయ్య ఈ జగడం భరించలేక ఎర్రెమ్మమీద చెయ్యి చేసుకున్నాడు. తన్ని చెప్పాడు బొమ్మని. ఎర్రెమ్మ వల్లాపన మొదలెట్టి తిట్టిపోస్తూ తన ఇంటిదారి పట్టింది.

కోటయ్య తర్వాత తమ్ముడిని కోప్పడ్డాడు. తమ్ముని సేతకానితనానికి చీదరించు కుని తనే మరదలు సన్నెమ్మని ఇంటికి తీసుకురావటానికి బయల్దేరాడు. తిట్టున్నతల్లిని ఇంటికి తీసుకువెళ్ళిన సన్నెమ్మని తుండుగుడ్డ నడుంకిచుట్టి సన్నెమ్మని బలవంతంగా గొరగొర యీడ్చుకు తెచ్చాడు కోటయ్య.

ఈ దృశ్యాన్ని ఆవూరు పెద్దరైతు అసిర్నాయుడు చూసాడు.

ఇక్కణ్ణించి కొత్తకథ ఆరంభమయింది.

సన్నెమ్మను యీడ్చుకువెళ్ళినవాడు- దాని మొగుడుకాదు— బావ- అన్న సంగతి తెలుసుకుని కోటయ్యమీద పడ్డాడు అసిర్నాయుడు. ఇక తగువు, సాక్ష్యాలు, వాదనలు, ప్రతివాదనలు, నిందలు, తీర్పులు, న్యాయాలు, శిక్షలు.

చివరికి 'అల్లుణ్ని బతిమాలి తీసుకుపో' అని ఎర్రెమ్మకు చెప్పాడు. అల్లుణ్నీ, కూతుర్నీ ఎర్రెమ్మ తన ఇంట్లో చూసింది.

నాయిరాలిచ్చిన పండుగ బువ్వపెట్టింది మొగునికి సన్నెమ్మ. ఆ తిండిమీదికి పైడయ్య దృష్టిపోలేదు. సన్నెమ్మ ఎదురుగా...!

యజ్ఞం కథలో లోపించిన జీవితం ఈ కథలో ప్రతి అక్షరంలో కన్పిస్తుంది. అలగాజనంలోని ఆప్యాయతలని, అనురాగాలని పట్టిఇచ్చిన చిత్రం. కూతురుబతుక్కోసం ఎర్రెమ్మ భరిస్తున్న అవమానాలు, హింసలు, నిరాదరణలూ, నిందలూ, కూతురు బతుక్కోసం ఎర్రెమ్మ పెట్టుకున్న తగువులూ, పోట్లాటలూ, తిట్టిన తిటూ, వాదించిన వాదనలూ- రచయిత ఎర్రెమ్మ పాత్రపోషణలో తీసుకున్న శ్రద్ధ అనితరసాధ్యమన్నంత ఉన్నతస్థాయిలో ఉంది.

పేదరికానికి ప్రేమ, పెళ్ళి, సంసార జీవనమూ, ఆనందం, సుఖమూ ఇవన్నీ కరువవుతాయి. అలాంటిబతుకు బానిసబతుకు. ఇది వర్గసమాజం యొక్క స్వరూపం.

దోపిడీకి గురయేజనం ఈ నికృష్టతని నిత్యం అనుభవిస్తారు. సన్నెమ్మ, పైడయ్యలకి యవ్వనం వచ్చినా, పెళ్ళి జరిగినా- వాళ్ళు సంసారజీవనాన్ని సాగించలేరు. సన్నెమ్మని ఒక పనిముట్టుగా వాడుకోవటానికి తల్లి ఎర్రెమ్మా, అత్త బంగారీ ఘర్షణపడ్డారు. కూలి సంపాదించే జంతువును చేయగల దుష్టవ్యవస్థ మనది. గాంధీజీ ముప్పయి నలభైఏళ్ళ క్రితమే హరిజనులని ఉద్ధరించారు. రాజ్యాంగం రాసి అంబేద్కరూ ఉద్ధరించారు. ఇంకా ఉన్నత రాజకీయపదవులని అధిష్ఠించి, గృహాలు దానంచేసి, ఉద్యోగ అవకాశాలు కల్పించి చాలా ఉద్ధరించారు. కాని మాలపేటలు ఏమాత్రమూ ఎక్కడా మారలేదు. మారుతున్న వైనం ఎక్కడా ఎంత వెతికినా కన్పించవు. దాడులూ, హత్యలూ, హింసలూ మాలలపైన ఎక్కువయినాయే కాని తగ్గిన సాక్ష్యం కూడా ఎక్కడా కన్పించదు. మాల పేటల్లోని జీవితాలమీద పరిశోధన చేసినంత కృషిచేసారు రామారావుగారు.

భూస్వామ్య వ్యవస్థకు మూలస్థంభాలయిన అసిర్నాయుడులాంటి వారి నియంతృత్వపు అధికారాలు ఎంతబలంగా సంఘంలో ఉన్నాయో ఆర్తి స్పష్టంచేస్తుంది. మాలపేట ప్రజలు పండగలుమాని, పస్తులతో తీర్పుకోసం అసిర్నాయుడు ఇంటిముందు పడిగాపులు పడ్డారు. ఇది మనదేశంలోని ప్రజాస్వామ్యం, స్వాతంత్ర్యం, ప్రాథమిక హక్కుల స్వరూపం.

కథాశిల్పానికున్న సుగుణాలన్నిటిని చేజిక్కించుకుని చూపించారు రచయిత. కథలో ఆదినించి అంతంవరకు శైలిఒకేవేగంతో, ఒకేదరువుతో, ఒక్కేధనితో సాగింది. శైలిలోగాని, కథనంలోగాని, యాసలోగాని, పరిశీలనలోగాని, స్పష్టతలోగాని యజ్ఞం కంటె ఆర్తిపరిణతి పొందిన కథ.

సన్నెమ్మ పైడయ్యల కోసం పాఠకుడు ప్రతి అక్షరంవెనకా ఉన్న భావంతో స్పందిస్తాడు.

పట్నంలో కళాసీగా పైడయ్య జీవితం పేదరికానికి పల్లెపట్నం భేదంలేదన్న సత్యాన్ని చూపుతుంది. ఎక్కడ బతికినా ఆ బతుకు మురికిబతుకే. ఎక్కడ తిన్నా, ఆతిండి పాసితిండే, ఎంగిలితిండే. ఎక్కడ నిద్రపోయినా బురదలోనే. పట్నం జీవితాన్నిచ్చి పైడయ్య ఒంటరితనాన్నీ, బానిస జీవితాన్నీ, పల్లెజీవితాన్నిచ్చి సన్నెమ్మ నిస్సహాయ జీవితాన్నీ పాఠకులముందు ఉంచారు రచయిత. పరిస్థితులని నిష్పాక్షికంగా, వస్తుగతంగా, స్పష్టంగా పాఠకుల ఆలోచన ముందుపెట్టి సరయిన మార్గంలో ఆలోచింప చేయటం రచయితల బాధ్యత. ఆ బాధ్యత నిజాయితీగల రచయితలు మాత్రమే చేబట్టగలరు. అదే సమాజంపట్ల రచయితకున్న కట్టుబాటు. ఆ కట్టుబాటునే మనము యజ్ఞం కథల సంపుటిలో స్పష్టంగా చూస్తాము.

గ్రాంధిక భాషావాదులు ఎప్పుడోనెత్తిన కొంగువేసుకున్నారు. వాళ్ళశిలావిగ్రహాలని ఇప్పుడు ప్రభుత్వం యూనివర్సిటీల్లో ఆవిష్కరించటం మినహా మిగిలిందేమీలేదు. కాని వ్యావహారిక భాషావాదులు మాత్రం సజీవమైన భాషని పరిశీలించి నేర్చుకోవ

టానికి సిద్ధంగా ఉండాలి. తెలుగుభాషలోని ఎన్నో మెళుకువలు యింకా మనం చేబట్టలేదు. ఆ సంగతి యజ్ఞం కథలు చదివినప్పుడు స్పష్టంగా తెలుస్తుంది. మాండలిక ప్రయోగాల్లో ఉన్న భావస్పష్టత, తెలుగుతనం, సారళ్యత, సౌలభ్యత కమ్మదనం ఈ కథల్లోని భాషలో తెలుస్తుంది. కొన్నివాక్యాలు చూడండి. 'కాదూ కూడదూ అవి వెలితిపడ్డారా' 'మల్లా ఈఊరు మట్టితొక్కితే మీరంతా నాసొగసూసినట్టే' 'పిడికిలిలో గాలిని తాటిస్తూ అడుగుతోంది' 'నిబ్బగా' 'ఇక్కడిలాగ పల్లిగర గరుసుకూకునే కన్న యెత్తైవొచ్చిన నష్టంవేటి?' 'బాగుందోలమ్మ' 'సన్ని అక్కుర్లు బుక్కర్లేడ్పి అలిసిపోయింది'. విశాఖపట్నం రచయితల్లో ప్రత్యేకంగా కన్పిస్తున ఈ ప్రయత్నం ఇతర మండలాల రచయితల్లో ఆసక్తి కలిగించేంతగా కన్పించటంలేదు. రామారావు గారిది శ్రీకాకుళం యాసప్రధానంగా. విశ్వనాథశాస్త్రిగారిది విశాఖయాస. ఆరెండు ప్రాంతాల యాసకి చాలదగ్గర సంబంధాలున్నాయి. బాగా పరిచయం ఉంటేనేగాని ఆ రెంటియాసల్లో భేదాలు గుర్తించటం సాధ్యంకాదు. ప్రజల భాష నేర్చుకోకుండా ప్రజల అవగాహనని రచయితలు తెలుసుకోలేరు. ఈ మార్గాన జరుగుతున్న కృషిని విస్తరింపజేయటం మరింత అవసరం. వట్టికోట ఆళ్వారుస్వామి, దాశరధి రంగాచార్య, పోరంకి దక్షిణామూర్తి, మా గోఖలే, ఇరివెంటి కృష్ణమూర్తి, సురమౌళి, కొవకళ్ళ వెంకటరత్నం, బలివాడ కాంతారావు ఈ అవసరాన్ని గుర్తించారు. కొందరు తమ ప్రయత్నాలని వొదులుకున్నారు కూడా.

రావి శాస్త్రిగారూ, కొడవటిగంటి కుటుంబరావుగారూ ఈకథల సంపుటికి రెండు పరిచయాలు రాసారు. కొడవటిగంటి కుటుంబరావుగారు కథల్ని పరిచయం చేయగా రావిశాస్త్రిగారు రామారావుగారి వ్యక్తిత్వాన్ని పరిచయం చేసారు. సారాకథలకి శ్రీశ్రీ రాసిన పరిచయం గుర్తుకొస్తుంది రావిశాస్త్రిని చదివితే.

చంద్రి ముఖచిత్రం ఎవరినన్నా ఆకర్షించేంత విశిష్టంగా, విలక్షణంగా, యజ్ఞం సంపుటిలోని బలాన్నంతటినీ పట్టిఇచ్చేదిగా ఉంది.

ముద్రణ నీట్‌గా ఉంది. సాగర గ్రంథమాల ఇలాంటి పుస్తకాలని ఇంకా ఎక్కువ తీసుకురాగలదని, గొప్ప సాహిత్యప్రమాణాలని సాధించగలదని ఆశిస్తాను.

—శ్రీపతి

లలితకళా అకాడమీ

# చిత్రకళా ప్రదర్శన - ఒక సమీక్ష

బంగారు పతకం ఈసారి లక్ష్మాగౌడ్‌కు లభించింది. పెయింటింగ్ జూలై-1 అన్న చిత్రానికి. పెయింటింగ్స్‌కి పేరుపెట్టడం గురించి ఆర్టిస్ట్లని అడిగితే 'అసలు పేరంటూ ఎందుకుండాలి? అని తిరగబడతారు. చిత్రాలకి పేరుపెట్టడం అన్నది తెలివి తక్కువగా తీసిపారేస్తారు. ఏపేరూ సరయిన భావాన్ని చెప్పదంటారు. మరి ఈపేరు సంగతేమిటంటే ఆ నెలలోచేసిన వర్క్ అది అని సమాధానం. ఆరకంగా పేరుపెట్టని పెయింటింగ్స్ నలభైనాలుగులో పద్దెనిమది ఉన్నాయి.

ఈ సంవత్సరం లలితకళా అకాడమీ ప్రదర్శన చూసినప్పుడు ఒక సంగతి స్పష్టంగా బోధపడుతుంది. సాంకేతిక నిపుణతలో ఉన్నత ప్రమాణాలతోపాటు వైవిధ్యం, విలక్షణత, సమగ్రత కన్పిస్తాయి. ఆధునిక చిత్రకళారంగంలో భారతీయ యువతరం ప్రపంచంలోని ఏ దేశాలస్థాయికీ తీసిపోదు. కొన్నిదగ్గర మన చిత్రకారులు ముందే ఉన్నారనికూడా అన్పిస్తుంది. వస్తువుదగ్గర మాత్రమే ప్రదర్శనలో కళాఖండాల స్థాయి కలగాపులగంగా చాల వెనకబడి ఉంది. అమాటకొస్తే పాశ్చాత్యదేశాల చిత్రాలు ఇంకా చాలా వెనకబడి ఉన్నాయి. వాటిగురించి వివిధ పత్రికల్లో చదివినదాన్నిబట్టీ, కొన్ని రిప్రొడక్షన్స్ చూసిన దాన్నిబట్టి, అడపాదడపా- కల్చరల్ ఎసోషియేషన్స్ యేర్పాటు చేసే ఎగ్జిబిషన్స్ చూసిన ఆధారంతో ఈ విషయం చెప్పగలుగుతాము.

వస్తువుదగ్గరి కొచ్చినప్పుడు దేశాన్ని జాగృతం చేస్తున్న, ప్రభావితం చేస్తున్న, కల్లోల పరుస్తున్న ఘటనలమీద సమస్యలమీద చిత్రకారుల అవగాహనని అంచనా వేయటం మేధావులకు తప్పదు. చిత్రకారుడు ఈ సమాజ భౌతిక రాజకీయ సాంఘిక పరిస్థితులను కాదని నిలబడేవ్యక్తి కానేకాడు. ఈశక్తుల సంఘర్షణలోనే అతడి ఉనికి. బంగ్లాదేశ్‌లో విముక్తిపోరాటం రగిలినసందర్భంలో బంగ్లా సినీనటి కబరీచౌదరి దేశాన్ని విడిచిపెట్టి పారిపోవాల్సి వచ్చింది. ఆ దేశచిత్రకారులు వారి సమస్యలమీద చిత్రాలు వేయాల్సివచ్చింది. ఆ సంఘర్షణ తీవ్రంగాలేని సందర్భంలో సామాన్య చిత్రకారులు, చైతన్యవంతమైన వ్యక్తిత్వంలేని చిత్రకారులు భౌతికపరిస్థితులను గుర్తించరు. అలాంటి చిత్రకారులు రకరకాల భ్రమల్లో, కన్‌ఫ్యూజన్‌లో, ఇగ్నొరెన్స్‌లో ఉంటారు. ఈరకమైన ఆలోచనని చిత్రకారుడు ఒప్పుకోడనుకోండి. డాగ్మాని పెంచుకుంటున్నాడన్నమాట

'రేప్ ఆఫ్ బంగ్లాదేశ్'లో కిరాతక పాక్‌సైనికుల హింసల్లో, అవమానాల్లో, మానభంగాల్లో. వాళ్ళ అమాయిక జీవితాలమీద దోపిడిపాలకులు బోర్లించిన కుంపట్ల కాల్పులను చూపించాడు దొరైస్వామి. అగ్రాఫిక్, ప్రపంచ చరిత్రలో జరుగుతున్న

ఒక భయంకర దశలోని వాస్తవపరిస్థితులని చిత్రించింది. బ్లాక్ ఎన్డ్ వైట్‌లో పిల్లలతో ముగ్గురు బంగ్లా తల్లులను కిరాయిసైనికుల చేతుల్లో కోల్పోతున్న జీవితాలను చిత్రించాడు. సామాజిక చైతన్యం ఉన్న చిత్రకారుడు దేశపరిస్థితులను చూస్తూ ఊరికే కూచోలేడు. తనతీర్పుచెవుతాడు. తనబాధ్యత నించి, తనకున్న సంబంధంనించి తప్పించుకోలేడు. దొరైస్వామి చిత్రాలలో ఈ గురుతరమైన బాధ్యత కన్పిస్తుంది.

కవితాదేష్కర్— ఒకప్పుడు లక్ష్మగౌడ్ ఈ పద్ధతిలో చిత్రించేవాడు— ఆ పోకడలలో కవితాదేష్కర్ 'పెయింటింగ్ 30'లో పక్షుల్లాంటి ఆకారాల్లో కెరటాల్లాంటి వేగంతో మనసుపొరల అంతరాలతో భీభత్సాన్నీ, సంఘర్షణనీ చిత్రించింది. ఆమె తొలిచిత్రాల్లో కూడా దగాపడిన తమ్ముళ్ళ బతుకల కథలున్నాయి. ఆమె రేఖలకు బలమూ, వేగమూ ఉన్నాయి. ఆమె డ్రాయింగ్స్‌కి సామాజిక అలంబన ఉంది. ఈ ప్రదర్శనలో 'పెయింటింగ్ 30' ఆమె పరిణామక్రమంలో పరిణత చూపిస్తున్నది. తీవ్రమైన భావప్రకటన సాధించేనేర్పు ఉంది.

సూర్యప్రకాష్ ఈసారి ప్రదర్శించిన కాన్వాస్—3, 1970 లో ఆబ్‌స్ట్రాక్ట్ ఫిగరిటివ్‌లోకివస్తున్న సూచనలు కన్పిస్తాయి. పెయింటింగ్ పైభాగంలో మధ్యన ఎద్దుతల పికాసోగెర్నికాలో గుర్రింతల ఉన్నంత భావసంపన్నతతో ఉంది. ఆ తలలో బాధనీ, దుఃఖాన్నీ, మొనాటనీని ఆధునిక జీవితంలోని అశాంతికిప్రతీకగా గుండెను పట్టుకున్నట్టు చిత్రించాడు. పెయింటింగ్ అడుగుభాగంలో అయన పెట్‌సబ్‌జెక్ట్ మొబైల్ రంగుల జవసత్వాలతో వెల్లివిరిసాయి.

ఇక లక్ష్మగౌడ్— యువతరం చిత్రకారుల్లో— ఒకే గొప్ప చిత్రకారుని పేరు చెప్పండంటే— లక్ష్మగౌడ్ పేరు చెప్తారు. అసాధారణమైన ప్రతిభావంతుడు. పనితనంలో, రంగుల పొందికలో, నిర్మాణంలో, వివరణలని ఇవ్వటంలో అసమాన్యమైన కళాచాతుర్యాన్ని చూపిస్తాడు. కళని జీవితంగా సర్వస్వం చేసుకున్న నిర్విరామ కృషి కన్పిస్తుంది. అయితే ఈ ప్రదర్శనలో అతడి పెయింటింగ్ లక్ష్మగౌడ్ వ్యక్తిత్వాన్ని చాటదు. అతడి మానవరూపంతో బుద్ధులతో పెరిగిన ఆదిమ జంతురూపాలతో వేసిన డ్రాయింగ్స్ ఒక కళాలోకం కల్పన. సామాజిక వైరుధ్యాల పోరాటభీకరత, భీభత్సం, ఉద్రేకం వాటిల్లో కన్పిస్తాయి. 'పెయింటింగ్ జూలై 1'లో ఆ వస్తువు లేదు. మాంసపుముద్దల్లో ఒక గర్భవతి స్త్రీ బెడ్‌మీద పడుకున్నది. కండరాల, ఎముకల పురుషుడు అలమటతో, ఆలోచనల్తో, అసంతృప్తితో ఘర్షణ పడుతున్నాడు. పాశ్చాత్య అలంకరణతో విశాలమైనగది. షెల్ఫ్‌లో రకరకాల పాత్రలు. మడచిన కర్టెన్, పైన చీకట్ని చూపే చిన్నకిటికీ. రెండు సమాన భాగాలుగాకలిపిన ఈకాన్వాస్ వ్యక్తిగతమైన అంతరాంతరాల హోరును చూపుతుంది.

న్యూఢిల్లీలో సెప్టెంబరు నెల మొదటి వారంలో లక్ష్మగౌడ్ గ్రాఫిక్స్ ఎగ్జిబిషన్ గొప్ప సంచలనాన్ని కలిగించింది. పత్రికలు చాలా విపులంగా ప్రశంసించాయి. రెండోవారం సూర్యప్రకాష్ ప్రదర్శన ఢిల్లీలో మరొక ఆకర్షణగా తయారయింది.

ఏడవ బయానల్ పారిస్‌కి సూర్యప్రకాష్ పెయింటింగ్‌ని సెలక్ట్‌చేసారు. అది నిజంగా సూర్యప్రకాష్‌కి తగినగుర్తింపు. ఈగ్రూప్ చిత్రకారుల్లో దేవ్రాజ్ పూర్తిగా అబ్‌స్ట్రాక్ట్స్ చేస్తున్నాడు. ఈప్రదర్శనలో లిథో జూలై 71–1 అన్న గ్రాఫిక్‌కి అవార్డులభించింది. ఆ రంగుల పొందికకు మనం తన్మయులం అవుతాము. అవి అర్థంకావు.

మధుసూదనరావు 'సింబల్స్ ఆఫ్ శివా టూ', నరేంద్రిరాయ్, రెడ్డప్పనాయుడు చిత్రాలని తాత్వికకోణాల్నించి చూడాలి. అవి చిత్రకారుల అయోమయాన్ని, అస్పష్టతనీ, కృతకమైన ఆలోచనల్నీ ప్రకటిస్తాయేతప్ప ప్రతిభని చూపలేవు. రెడ్డప్పనాయుడు 'అనంతం' అన్నచిత్రిం చాలపాతకాలపు ప్రయోగం. భావంలో కావలసినంత గందరగోళం. మొత్తం ప్రదర్శనలో విసుగుపుట్టించాయి ఈ ధోరణిలో వచ్చిన చిత్రకారుల పెయింటింగ్స్.

తాహెర్ అహ్మద్, బద్రినారాయణ్, మహమ్మద్ ఉస్మాన్‌సిద్ధికి చిత్రిల్లో వక్రతత్వీకరణ కనిపించదు. ఆ ముగ్గురు మంచి ప్రమాణాలుగల చిత్రకారులు. వీరిలో కొత్తను అన్వేషించగల ప్రతిభగాని, తిరుగుబాటుచేయగల సాహసంగానీ కనిపించవు.

మనోహన్‌దత్ 'పెయింటింగ్- ఒన్', దాతార్ 'మొమెంట్ ఆఫ్ హార్మొనీ–6' విద్యాభూషణ్ 'ది గార్డెన్' 'మాన్యుమెంట్'లు బాగా ఆకర్షిస్తాయి. మళ్ళీ ఇవి అబ్‌స్ట్రిక్ట్ చిత్రాలవటం వలన అవిచేప్పే భావంలో ఎప్పుడూ ఏకత్వం ఉండదు కొన్నిసార్లు అవి అనుభూతికి మాత్రమే పరిమితమయిపోతాయి. మనోహన్‌దత్ ఫిగరిటివ్ నించి ఇటు అబ్‌స్ట్రిక్టులోకి రావడం, సాంఘిక లక్ష్యాలకు దూరమవడమే.

బాలూ 'దెబ్బతిన్న పక్షి', యాదగిరిరావు 'మీనం' సత్యనారాయణ 'సిట్‌ఎట్' మంచి ప్రమాణాలున్న శిల్పాలు. బాలూ శిల్పంలో పక్షి దెబ్బతిన్నబాధ ఆకారం కన్పిస్తుంది. శిల్పాల్లో ఈ ఇత్తడితోచేసిన చిత్రం కొత్తగా ఉంది.

చిత్రికారులు తమ జీవితంలోని సంఘర్షణని, సమాజ జీవితంలోని విలువలనీ అంతర్జాతీయ ప్రభావాలనీ తమ వస్తువుగాతీసుకుని జాతి చైతన్యాన్ని రూపురేఖలు దిద్దే బాధ్యతని తీసుకుంటారని, భవిష్యత్తులో ఈ కళాప్రమాణాలు ప్రాధాన్యత తీసుకుంటాయని– ఆ ప్రయత్నంలో మాత్రమే ప్రపంచంతో చిత్రకారుల సంబంధం బలపడుతుందని– నాలానమ్మే చాలమందిలా ఆశ నాకూ ఉంది....

